# ఋతుసంహారము.

కడప టవున్ సబు మేజస్ట్రీటు

తాడూరి లక్ష్మీనరసింహరాయ పండిత విరచితము.

మొదటి కూర్పు

కాకినాడ

సుజనరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

1910

# PREFACE.

THIS is a translation of Poet Kalidasa's **Ritusamharam** or '**Cycle of Seasons**'. I translated the poem in 1898. As regards the merits of the poem, I only quote below the opinion given in the Imperial Gazetteer of India by DR. A. A. MAC DONELL, Boden Professor of Sanskrit at Oxford :—

" The Cycle of the Seasons consists of 153 stanzas—the " edition I have, consists of only 144 stanzas—in six cantoes "composed in various metres. It is a highly poetical descrip- " tion of the six seasons into which Classical Sanskrit poets " usually divide the Indian year. By the introduction of love " scenes, the poet adroitly interweaves the expression of " human emotions with glowing accounts of the beauties of " nature. Perhaps no other work of Kalidasa's manifests so " strikingly the poet's deep sympathy with nature, his keen " powers of observation and his skill in depicting an Indian " landscape in vivid colours."

CUDDAPAH,
*2nd August 1910.* TADUR LAKSHMI NARASIMHARAO.

# పీఠిక.

కాళిదాసమహాకవి షడ్రుతువులును వర్ణించుచు సంస్కృత భాషలో ఋతుసంహారమను నొక చిన్నకావ్యము రచించెను. అందా యాయిఋతువుల కనుగుణముగ భూతస్వభావము లెస్సగ వర్ణింపఁబడి యె. ఆవర్ణన యసమానమయినదని ఆంగ్లోమహావిమర్శకులుసహితము వ్రాసియున్నారు. కాలమును బట్టి వర్ణన కొన్ని కొన్ని చోటులఁ జదువరులకుఁ గటువుగా నుండవలసినను దాన సరసకవి యగుటచే నట్లుగాకుండఁ గాళిదాసుఁడు మొదటనుండి చివరదాఁక శృంగార రస సమన్వితముగఁ జేసెను. అట్టికావ్యము తెనుఁగుభాషలో నుండెనేని తద్భాషావధూటికి సింగార మెక్కువచేయు నొక యలంకారముగా నుండఁ గలదని యెంచి దానిని క్రీస్తుశకము 1898 వ సంవత్సరమునకు సరియగు విళంబి సంవత్సరమునందు యథాశక్తిని దెనిఁగించితిని. అది యింతకాలముదాఁక శోభనపుఁ బెండ్లికూఁతురువలె నేకాంతంబున నుండెను గాని దానింజూడఁగాంచిన నామిత్రులెల్లరు నామీఁది యనురాగముచే సంతోషించి దానిని లోకుల కెల్లరకు దృష్టిగోచర యగునట్లు చేయుమని యడుగుటంజేసి యిప్పుడు దాని నెల్లవారికిఁ గానుకగా నొసంగుచున్నవాఁడను.

కడప.
17-9-1910.

తాడూరి లక్ష్మీనరసింహారావు.

# ఋతుసంహారము.

## వసంతర్తువు.

తరల.

పొనర విడ్చినతియ్యమామిడి పువ్వులన్ శితబాణముల్
వినుతమై తగుతేఁటిబారను వింటినారిని గూర్చుచున్
దనరి కాముకులైనవారిమనంబులన్ వ్యథపెట్టఁగా
ఘనుఁడు తాను వసంతయోధుఁడు కాంత వచ్చెను జూచితే. 1

చ. జలములు శోభఁజెందె జలజంబులచేతను వృక్షజాతి పూ
వులఁ గనె స్త్రీలకామములు పొంపిరివోయెను గాలి తావిచే
నలరెఁ బ్రదోషముల్ సుఖములయ్యె దినంబులు రమ్యమయ్యె నో
చెలియరో యీవసంతమునఁ జిత్తహరంబు సమస్తవస్తువుల్. 2

మత్తకోకిల.

మాతినీళ్ళకుఁ గెంపుమేల్మొలనూళ్ళకున్ గడుఁజక్కనా
శీతభానునికాంతికిన్ సరసీరుహాక్షులకున్ సుమా
న్వితమైతగు తియ్యమామిడి వృక్షసంపదకున్ గడున్
లేఁతతీవియబోణి! శోభ బలే వసంతుఁడొసంగెడిన్. 3

చ. కుసుమపుటెఱ్ఱరంగుగల కోమలమైనదుకూలముల్ ప్రియం
బెసఁగఁ బిఱుందులందు ధరియించుచుఁ గుంకుమరాగగౌరమై
పసదలయొఱ్ఱవల్వలను భామలు చన్నులమీఁదఁ బెన్నెడం
గెసకమెసంగఁ దాల్చెద రహీనపువేడుక లార నెచ్చెలీ. 4

తే. కామినులకర్ణములఁ గర్ణికారములును
నీలిచపలంపుఁగురులఁ గంకేళిపూలు
చాలవిరిసినవిరజాజిపూలు మిగులఁ
గాంతిఁగాంచుచున్నవి కమలనయన. 5

ఉ. చన్నులమీఁద స్వచ్ఛమగుచందనసిక్తములైనహారముల్
కిన్నరవాణి! పైఁడిభుజకీర్తులు గంకణముల్ కరంబులం
దున్నతమౌపిఱుందులను నొప్పగ మేల్ మొలనూళ్ళు దాల్చువా
రెన్నఁగరానివేడ్కఁగలయింతులు మన్మథతాపవేదనన్. 6

తే. కనకకమలంబులంబోలు కమలముఖుల
మకరికాపత్రదీప్తమౌ మొకములందు
రత్నమధ్యస్థమౌక్తికప్రకరసామ్య
మైనశ్రమజలబిందుసంతాన మొప్పె. 7

చ. చెలి! మకరీకలాపములచేఁగడునెల్లుచుఁ బైఁడిపంకజం
బులఁగనినవ్వునట్టిపువుబోఁడులమోములయందుఁబర్వెడున్
జెలువగువింతకాంతిగలచెమ్మటచుక్కలు కెంపుగుంపులో
వలనలయాణిముత్యములు భాసిలుచుందువిధంబుదోఁపఁగన్. 7

ఉ. మారునితీవ్రతాపమహిమంబున నంగములెల్ల నుబ్బి పొం
గారుటఁజేసి రైకయును గట్టినచీరయు వీడ నుత్తసం
చారము పడ్కటిండ్ల నతిసంభ్రమమారఁగఁ దాము సల్పుచోఁ
గూరిమిభర్తవచ్చుటయుఁ గోమలు లుత్సుకలైరి యెంతయున్. 8

ఉ. సన్ననిమేనుఁ గుందనపుఁజాయలమేనును మాటిమాటికిన్
బన్నఁగనావులింతలనుభాసిలుమేనును నీల్గుమేనునున్
నున్నమెఱుంగుఁదళ్కులమనోహరసంభ్రమమైనమేను దా
నెన్నఁగ మేనులేనియతఁ డీఁదొడఁగెన్ బ్రమదాజనాళికిన్. 9

చ. అమలిననేత్ర! స్త్రీలమదిరాలసనేత్రములందులోలుఁడై
విమలపుఁజెక్కుటద్దముల వింతగ బంగరుఁజాయవాఁడునై
యమరఁగఁజన్నులంగఠినుఁడై జఘనంబులగర్వియై సుమ
ధ్యములవినమ్రుఁడై మరుఁడు తాఁ బలుపోకలుపోయెఁజూచితే. 10

ఆ. నిదురబద్ధకంపు నెమ్మేనిహొయలును
మదముబద్ధకంపు మాటవరుస
బొమ్మముళ్ళతోడఁ బొల్పొప్పువాల్చూపుఁ
జేసెఁగాముఁ డిపుడు చేడియలకు. 11

తే. అబల! కస్తూరి కుంకుమం బగరు పేరింక
ణమ్మునుం గల్పి శ్రీచందనమ్ము లంది
కొనుచునున్నారు కామినుల్ కోర్కెఁ బసిమి
వన్నెచన్నుల కతిమదబద్ధకమున. 12

మ. చెలియా మున్ను ధరించినట్టి బలువౌ చీరల్ తగన్ విడ్చి వే
నలిఁ గృష్ణాగరుధూపజాలముల నందంబొప్పు సౌగంధ్యముల్
వెలయన్ లత్తుకరంగుగల్గి జిలుఁగై పెంపొందు నప్పావడల్
లలనల్ కాషమదాలసాంగలయి దాల్పంజొచ్చి రివ్వేళలన్. 13

మత్తకోకిల.

తియ్యమావిరసంబు గ్రోలి మదించి మిక్కిలి ప్రేమతోఁ
జయ్య నెచ్చెలి గండుఁగోయిల చక్కముద్దుల నాడెఁదా
నియ్యలీంద్రము తమ్మిలోపల నేచి ఝుమ్మని పెంటితో
నొయ్యనన్ సరసంబులాడుచు నున్నదిప్పుడు నెచ్చెలీ! 14

తే. ఎఱ్ఱచిగురాకుగుత్తుల కించుకంత
వంగి పూచినకొమ్మల వఱలి గాలి
కల్లలాడుచుఁ దియ్యమామిళ్ళ సంగెఁ
జంచలాక్షుల కెంతయు సంతసమ్ము. 15

తే. తెల్ల పవడంపుఁగెంపు నిల్వెల్లగలిగి
వఱలు పుష్పాళి ధరియించి పల్లవాళి
గలిగి కులుకు నశోకలతలను మ్రోలఁ
జూచి విరహిణులెల్ల సశోకలైరి. 16

చ. మదమున వ్రాలి పూలవయి మక్కువమీఱఁగ ముద్దులాడఁ దు
మ్మెదలిలఁ జల్లగాడ్పులకు మెల్లన లేఁజిగురాకులాడ స
మ్మద మొదవింప మొగ్గ లెలమావులఁ జూడఁగఁ గాముకాళికిన్
హృదయములోపలన్ వలపు లెంతయు నువ్విళులూర వే చెలీ. 17

గీ. అవనిఁ గాంతాముఖద్యుతిహారినూత్న
కురవకద్రుమమంజరీపరమశోభ
గాంచి యేగుండెగలవాని గట్టిగుండె
తాళుఁ గందర్పశరహతి పాలు గాక. 18

మ. ఘనమై వెల్గెడుపూలగుత్తు లొలయంగా వంగి పెన్గాలి చే
తను దూఁగాడుచుఁ బెద్దప్రజ్వరిలునద్దావానలం బోయనన్
జనఁగా మోదుగుదోఁట లెల్ల యెడలన్ రక్తాంశుకం బొప్ప శో
భనపుం బెండిలికూఁతురోయనఁగ శోభంగాంచె భూదేవి తా. 19

గీ. పొలతుకలయందుఁ దగులమౌ పురుషమతులఁ
బికకలాలాపములు తాము ప్రిదులు పఱపఁ
జిలుకముకుఁజాయ మోదుగుల్ చీల్పఁ జీల్ప
గణికాకారంబు లోకాంత కాల్పఁదొడఁగె. 20

ఉ. సమ్మదమారఁబాడఁగను శ్రావ్యముగాఁగను గండుగోయిలల్
తుమ్మెద లెల్లనున్మదముతోడుత మిక్కిలి తొక్కునాదముల్
ఝుమ్మని సేయ నీతియును జొక్కపుసిగ్గును గల్గి యిండ్లలో
నెమ్మదినుండు క్రొత్తడుల నెమ్మది సైతము సంభ్రమించెడున్.

మత్తకోకిల.

కొమ్మ! పూచినతియ్యమామిడికొమ్మలూపుచు వేడ్కతో
రమ్ముగా నలుదిక్కులన్ పికరావముల్ బలె వేగవ్యా
ప్తమ్ము సేయుచు మంచులేమిని దాను శోభనమూర్తియై
యిమ్మహీజనచిత్తముల్ హరియించి వాయువు వీచెడిన్. 22

చ. చెలియ! విలాసముల్గలుగు చిల్కలకొల్కులనవ్వు తెల్లనై
యలరెడుమల్లెమొగ్గల సముంచితమై కరమింపు గుల్కుచున్
జెలి ప్రమదావనంబులు ఋషివ్రజశుద్ధవిరాగచిత్తమే
కలఁప సరాగవక్ర మగు కాములచిత్తము చెప్పనేటికిన్. 23

ఉ. తియ్యగఁ బాడఁ గోయిలలుఁ దేంట్లుఁ బిఱుందులఁ జన్నులందునుం
దొయ్యలిరో పసిండిమొలనూళులు హారము లాడుచుండఁగాఁ
దియ్యనివిల్తుదాడికి నతిత్వర వాడిన తియ్యఁబోండ్ల నే
యయ్యలమానసంబు లకటా చలియింపవు చూచినంతనే. 24

తరల. పలుఁదెఱంగుల పువ్వుఁదోఁటల ప్రాంతభూముల మత్తకో
కిల రవాకుల సానుభూమి సఖీళశాంక శిలాతలం
బుల వెలింగెడు కేళిపర్వతముల్ గనుంగొని యెల్లవా
రలు మనంబున సంతసించుచుఁ గ్రాలువారలు చూచితే. 25

గీ. మిగులఁ బూచిన తియ్యమామిళ్ళు చూచి
వనట వనితావియోగు లౌ పాంథు లడలి
ముక్కులును గన్నులును జేత మూసికొనుచు
మొఱ్ఱలిడి యేడ్చుచున్నారు మోహనాంగి. 26

గీ. పికకలరవంబులును మత్తభృంగరుతము
గోరకితచూతములు గర్ణికారములును
గఱకుటమ్ములుగాఁ జేసి కాంతలమతు
లలచెఁ జైత్రుఁడు వలరాజు గెలుపు గోరి. 27

ఉ. ఎవ్వనిబాణ మామ్రసుమ మెవ్వనిచాపము కింశుకంబు తా
నెవ్వనినారి తేఁటికుల మెవ్వనితెల్లనిగొడ్గు చందురుం
డెవ్వనిదంతి మారుత మదెవ్వనివందిజనంబు కోకిలం
బవ్వలరాజు చైత్రయుతుఁడై యిడుఁగావుత శోభనంబులన్. 28

## గ్రీష్మర్తువు.

ఉ. చండత వెల్గుచుండఁగను జండకరుం డలచందమామ రే
యెండలు గాయుచుండ మది కింపుగ నీళ్ళలు స్నానయోగ్యమై
యుండి హతంబులై యమరుచుండఁగ సంధ్యలు సొంపునింపఁ గం
తుం డుపశాంతుఁడై యమరఁ దోఁచెను గ్రీష్మదినంబు నెచ్చెలీ. 1

ఉ. ఎందఱు నల్ప్రమింగి కరమింపగు వెన్నెల నాశ్రయించువా
రెందఱు నీటియంత్రముల నెంతయు వింతగునిండ్ల నుండువా
రిందుశిలాతలాదులను నెందఱు వేడ్కఁ గూరుచుండువా
రెందఱు చందనంబు మెయి నెక్కుడలం దెదువారు నెచ్చెలీ. 2

చ. చెలియ! సువాసనల్ గలిగి చెన్నగు మేడలలో మెలంగుచుఁ
జెలి కదలంగనూది తమ చేతి కొసంగెడు కల్లు ద్రావుచుఁ
వలపుల నూరఁజేయఁ దగి భాసిలువీణియపాట వించుఁ దా
మలరుచు నున్నవార లహహా యిపు డద్దమరేయి కాముకుల్. 3

చ. అరయ దుకూలమేఖలల నందముగాంచు పిఱుందులతో మహో
హారముగఁ జందనార్ద్రమయి హారయుతంబగు చన్నుఁగొండతో
నరగున స్నానసుందరకషాయసువాసితమైన కొప్పుతోఁ
దరుణులు కాముకాళి తనుతాపము జల్లన సేయువారిదే. 4

గీ. రామ! రామలు పారాణి రంజితమ్ము
లైనయడుగుల నడుచుచో హంసరుతము
నిరసనము సేయునట్టి యందియల మ్రోఁత
ఘల్లుమనఁ గాముకులగుండె ఝల్లుమనదె. 5

అంబురుహావృత్తము.

చందనపంకము చేతను మిక్కిలి చర్చితంబయి యొప్పియా
యిందుహిమాచ్ఛములై తగుహారము లెంతయుం బయినాడ నిం
పొందెడుచన్నులు బంగరుగంటల నొప్పు నమ్మొలనూళ్ళచే
నందముగాంచు పిఱుందులు వేడుక లౌర యియ్యవె యేరికిఁ. 6

చ. చెలి! విను మంగసంధులను జెమ్మటపట్టుటఁ జేసి యెంతయుం
బలువగుచీరలఁ విడిచి పల్చని సన్నపు టుత్తరీయముఁ
సలలితమౌ విలాసములుఁ జక్కని చిక్కని నిక్కుచన్నులుఁ
గులుకు వయస్సునుం గలుగు కొమ్మలు దాల్చిరి చన్నుదోయిపై. 7

ఉ. చల్లనిచందనోదకము చల్లెడువీవనచల్లగాలిచేఁ
జల్లనిహారముల్ మెఱయుచన్నులకానకు సమర్పణంబుచే
వల్లకి నల్ల మీటి పికవాణులు పాడు మనోజ్ఞగీతిచే
మెల్లగ మన్మథుం డిపుడు మేల్కొనె నిద్రితుఁడో యనం జెలీ. 8

గీ. శుభ్రమగు సౌధములలోన సుప్తినందు
స్త్రీలముఖములు వేడ్కతో రేయి చూచి
యకటకట సిగ్గుపడ్డట్టు లల్లరేయి
తెల్లవాఱుడుఁ జంద్రుండు వెల్లవోయె. 9

గీ. సకియ ! నుడిగాడుపులచే నసహ్యమగుచుఁ
జండమార్తాండు నెండకు మెండు మండు
ధర వియోగాగ్నిలో మతుల్ దగ్ధమగుచు
నున్న పాంథులు గననైన నోపరైరి.

గీ. ఎండచే మలమలమాడి మృగములెల్లఁ
బెల్లుతృషచేతఁ గుత్తుక లెల్ల నెండి
నున్న కాటుకవన్నియమిన్ను గాంచి
పఱవదొడఁగెను నీరనిభ్రమసి యడవి. 1

గీ. వ్రాలుఁజూపులుఁ జిఱునవ్వు పగలు మిగుల
దనర వగలాండ్రు పాంథులమనములందు
విరహవేదన పుట్టించి వెలసి రిపుడు
శశిరుచిరభూషణములైన సంధ్యలట్లు. 12

గీ. ఎండవేఁడికిఁ బై వీఁపుమండి నేలఁ
గాలిపెందూళిచేఁ గ్రిందఁ గడుపుమండి
పాము తలవాల్చి రోఁజుచు వక్రగతిని
నెమలిపంఛంబునీడను నిలువఁబోవు. 13

గీ. కాంత కడుడప్పిచేఁ బరాక్రమము పోయి
నోరుతెఱచి యొగర్చి నిండారునాలుక
వ్రేల్చి మృగరాజు కటకటా జూలు [illegible]లింపఁ
దారసిలునేనుఁగును గొట్టఁ గోరఁ డయ్యో.

కంఠమెండఁగ హస్తసీకరము లింక
నెండ కత్యంతముడుకుచు నేనుఁగులును
నీరువట్టున నీరమే కోరి బళిర
కేసరిని బ్రోలఁ జూచియు నోసరిలవు. 15

చ. అనలములోన నెయ్యొలికినట్టుల మండెడు సూర్యరశ్మిచే
మనమును మేను రెండుడికి మానిని ఖేదము తామునొందుటన్
ఘనమగు పింఛరాజిని మొగంబిడి చాల సమీపవర్తులై
చనియెడు పాములం జదుపఁజాలవు నేఁడు నెమళ్ళు చూచితే. 16

చ. కన ఋఱచాఁతి తుంగగమి కంజదళాయతనేత్ర! మొల్చుటం
బౌనరుసరస్సుల న్నిడుదమోరలఁ ద్రవ్వుచు డాఁగ భూతలం
బును జొరఁబోయెనో యనఁగఁ బొల్చుచునున్నవి సుమ్మి నేఁడు తా
మినకిరణాళిచే నుడికి రేపటియున్న వరాహయూథముల్. 17

చండతరకరమాలికల్ సవిత్రుఁడనుపఁ
గరము తపియించి మడువులో బురదనీటఁ
పాసి పడెఁ గప్ప దగగొన్న పాముపడగ
గొడుగునీడను బ్రదుకఁ జీవుఁడ యటంచు. 18

ఉ. తామరతూఁడులం జెఱికి తద్దయుఁ బోలుచు నొండొకంటి ను
ద్దామగతిం జరించి వివిధంబుగఁ ద్రొక్కుచుఁ బంకిలంబుగా
సామజముల్ సరస్సులను సల్పెను జేఁపవిపత్తు నొంద నిం
కేమిటి కిందునుండనని రేఁగెను బెగ్గురులెల్ల భీతిచే. 19

ఉత్సాహ.

నీరజాప్తు ప్రభకుఁ గాలి నెత్తిమణులు ప్రేలఁగా
నారడప్పి నాలుకలార్చి యనిలమాని దావముక
నీరజాప్తు ప్రభ స్వవిషము నెఱి దపింపఁ జేయఁగా
నారపాము పట్టఁగడఁగదయ్యెఁ గప్పలం జెలీ. 20

నురుగు సెలవులఁగారఁగా నోళ్ళు తెఱచి
యొజ్జనాలుకలు వ్రేలిచి యెత్తి మొగము
లించుక జలంబు లెక్కడో గాంచి కొండ
బిలము దగగొన్న గేదెలు వెడలివఱచె. 21

మ. అతి తీవ్రంబగు కాఱుజిచ్చునకు సస్యాంకూరముల్ మాడఁగా
నతితీవ్రంబగు వేఁడిగాడ్పుల కెండాఁకుల్ ధరన్ రాలి పో
నతి తీవ్రంబగు నెండవేఁడిమికి నత్యంతంబు నీరింకి పో
మతిఁ జూడంగ వనాంతముల్ భయము భామా యయ్యెఁగా యెల్లెడన్. 22

చ. పులుఁగులు చెట్లయాఁకు లిలఁ బొల్పఱిరాలిన వెచ్చనూర్చె న
మ్ములపొదరిండ్లదూరెఁ గడు మల్మలమాడుచుఁ గోఁతిగుంపుల
గ్గలమగు డప్పి నీటికయి ఖడ్గము లిందునునందుఁ బోవఁ జు
మ్మల శరభమ్ము జిహ్మగతి నమ్మరొ నూతుల నీరుఁ గ్రోలెఁగా. 23

ఉ. ఓరమణీమణీ వికసితోజ్జ్వలనూత్న కుసుంభపుష్ప సిం
దూరపుఁజాయఁ గాంచి పవనుండు రయోద్ధతిఁ దోడుసూపఁగా
భూరిలతాసుశాఖశతభూజముఖంబులఁ గౌఁగిలించి వే
ధారుణిఁ బావకుం డకట దగ్ధముచేసెను దిక్కుదిక్కులన్. 24

మ. ఒకచోఁ బ్రాంతదవాగ్నిప్రజ్వలితమై యొప్పెన్ దరీమధ్యమం
దొకచో నెండు వెదుళ్ళ దేశములలో నొప్పెన్ చిటేల్ మంచు నొం
డొకచోఁ బర్వి నిమేషమాత్రమున నోహో గడ్డిలోఁ బ్రాకె నొం
డొకచో లేడులపిండు శోషిలఁగ నోహో చేసెఁ గంటే చెలీ. 25

ఉ. బూరుగుఁగాటి నెల్లెడలఁ బుట్టుచు వే బహురూపధారి నా
నారసి చెట్లతొఱ్ఱలను హాటకవర్ణముతో స్ఫురించుచున్
ధీరతఁ బండుఁజెట్లపయి ధిక్కృతి దూఁకుచు నగ్నిహోత్రుఁ డ
మ్మారుతభూతుఁడౌట మహిమన్ జరియించె వనాంత మెల్లెడన్. 26

తే.గీ. సింహగజగవయము లగ్నిచేత నుడికి
పరమహితు లట్ల ద్వంద్వభావంబు విడిచి
కలసి చిచ్చునఁదెగఁగాలుకాఁడు విడిచి
యిసుకతిన్నెలఁ బఱపైన యేటఁబడియె. 27

చ. సరసిజనీరపానములు చల్లని గొజ్జఁగి నీటిస్నానముల్
సరములు పండువెన్నెలలు చక్కనిపాటల పుష్పవాసనల్
సరసములైన గీతములు సారసనేత్రలతోడి స్నేహముల్
కరము వెలుంగ మేడల సుఖంబులనందుము గ్రీష్మరాత్రులన్. 28

## వర్షర్తువు.

తే.గీ. కమలలోచన సుఘనాఘనములతోడ
మెఱుఁగులను టెక్కెములతోడ నుఱుము లనెడు
వాద్యములతోడఁ గామినీహృద్యముగను
రమణ వర్షర్తు విదె వచ్చె రాజువోలె.

తే.గీ. చెలియ! నీలోత్పల చ్ఛాయగలవి కొన్ని
కలికి! భిన్నాంజనచ్ఛాయగలవి కొన్ని
గర్భిణీస్త్రీ స్తనప్రభ గలవి కొన్ని
యగుచు మిన్నెల్లఁ గప్పెను మొగుళు లిపుడు. 2

### అంబురుహవృత్తము.

పెద్దయు డప్పిని జాతకపక్షులు వేఁడికొంచును దుర్భరా
పద్దశనుండుట కోర్వక రే జలభార మారఁగ వీఁగుచున్
దద్దయు వీనుల కింపుగ నుర్మ్రుచు ధారలం దయసేసి నం
పద్దశ నిచ్చుచు మబ్బులు మింటను మందమై చెఱలాడెడున్. 3

చ. ఉఱుములు పిడుగులుం బహుతరోగ్రపుభేరులు గాఁగ మేఘముల్
మెఱుములు నారియై యొసఁగు మేలగు నింద్రధనుస్సు పట్టియు
క్రూర ఖరవర్షధారలను నాశితబాణము వేసివేసి చె
చ్చెఱ ధరఁ బాంథపూరుషుల చిత్తములం గడు నొవ్వఁజేసెడిన్. 4

తే.గీ. సానఁబట్టినపచ్చలచాయ గడ్డి
మొలకలును లేఁతకందళీదళము లార్ద్ర
కీటకమ్ములు వ్యాపింపఁ గరలి భూమి
రంగు రతనాల సొమ్ముల రమణిఁ బోలె. 5

చ. కెరలుచు వేడ్కమీఱఁగను కేకలు వేసి విశాలపింఛముల్
నరగున విప్పి యొప్పి కడుసంభ్రమ మారఁగ నెచ్చెలిన్ శుభం
కరముగ ముద్దులాడుచును కౌఁగిటఁజేర్చుచుఁ బ్రేమమీఱఁగా
నిరతమనోహరం బగుచు నృత్యముచేసె నెమళ్ళు నెచ్చెలీ. 6

తే.గీ. వడిగ దరిఁగల తరువులఁ బడఁగఁ ద్రోచి
కలుషజీవనవిభ్రమాకులతఁ దాల్చి
యల్ల రత్నాకరునితోడ నకట నదులు
సంగమించెడుఁ జూ విటీజనములట్లు. 7

ఉత్సాహ. చెలియ! చెలఁగి లేళ్ళు మేయు చిత్రనీలవర్ణమౌ
పలువిధంపుటంకురములపచ్చగడ్డిబీండ్లతో
లలితగతిఁ జిగుర్చు సొగసులతలతోడఁ దరులతో
వెలయు వింధ్యవనములెల్ల వేడ్కఁ బుట్టెఁ జూడఁగన్. 8

తే.గీ. చెలియ! చపలంపు నల్ల కన్గలువపూలఁ
బొదలు మోవ్ములు దాముసు బెదరు లేళ్ళు
నలుఁగడలఁ గ్రాల సికతావనములలోనఁ
బరమసంతోష మయ్యె నో హరిణనయన. 9

చ. పిడుగులు రాల బిట్టుఱుము భీకరమేఘము లాకసంబునన్
విడివడి చిమ్మచీఁకటుల విశ్వము ముంచిన రాత్రులైననున్
నడినడి మించువెల్గుకతనం దమమార్గము చూచికొంచు వే
నడచెడువారు సూ వలపునన్ జెలియా యభిసారికామణుల్. 10

చ. బెడిదముగా వడిన్ గడుగభీరముగా జడదంబు లుర్ముచుం
బొడమి వెలుంగ మింట మెఱుముల్ మెఱయన్ బెగడొందుచుం గడుం
బడఁతులు సాపరాధులగు భర్తలనైతము కౌఁగిలింత్రు నేఁ
డెడ యిసుమంతయైన మది నెన్న నొడళ్ళకు లేనియట్లుగన్. 11

మ. చెలి! బింబాధరచారుపల్లవములం జెన్నొది కన్నల్లగ
ల్వలయందుండి స్రవించు వెచ్చనగు నీళ్ళందప్పుచుం బువ్వుదం
డలు సొమ్ముల్ మయిపూతలున్ విడిచి వేడ్కల్ లేక తామున్న వా
రలు నూ నేఁడు నిరాశలౌచుఁ బతు లూరన్ లేని కామామణుల్. 12

తే.గీ. కీటకరజస్తృణాదిసంకీర్ణమగుచుఁ
బాండువై వక్రగతిఁ బాముపగిదిఁ బాఱి
క్రొత్త నీ రిప్డు బిలములఁ గూర్చి పోవు
చున్న దిదె కప్పలెల్ల బిట్టులిక్క చూడ. 13

చ. వనితరో పువ్వులాఁకులును బాసి యథాస యొసంగునట్టి ప
ద్మిని విడనాడి సంభ్రమము మీఱఁగఁ దేఁటులు కర్ణపర్వమై
చనియెదురీతిఁ బాడుచును జ్ఞానములేక పడందొడంగె నే
గ నెమలులాడ వానిపురికన్నులమీఁద నవోత్పలభ్రమన్. 14

చ. తొలకరిమబ్బు లుర్ముటయుఁ బోడనయేచి మదాటవీగజం
బులు పెను బృంహితంబులు నముజ్వలరీతిని మాటిమాటికిన్
నలుపఁగ నుత్పలప్రభలఁ జాలనొసంగెడు తత్కపోలమం
దళికుల మోలలాడెడు సమంచితమౌ మదవారిధారలన్. 15

చ. చెలి తెలికల్వకాంతిగల చిక్కనిమబ్బులు వ్రాలుటాలతో
నలుఁగడలందుఁ బాఱు స్రవణంబులతోడను బించెవిప్పి పే
రెలమిని నిందునందుఁ దగ నృత్యము సేయునెమళ్ళగుంపుతో
నలరుచుఁ గొండ లిప్పుడు ప్రియంబొనరించెడుఁ జూచువారికిన్. 16

తే.గీ. గిరికదంబసర్జార్జునకేతకీ వ
నములు నూపుచుఁ దత్సుగంధములు దాల్చి
సఖి చినుకుమబ్బులోఁ గూడి చల్లపడుచు
వీచువాయువు లియ్యవే వేడ్క మనకు. 17

చ. పిఱుఁదులమీఁదవ్రాలు తలవెంట్రుకలున్ గమఁగమ్మతావులన్
నెఱపుసుమావతంసములు నీరజలోచన హారయుక్తమై
మెఱసెడు చిన్నిచన్నులును మేలగు తేనియలొల్కు మోవులున్
గుఱుతుగఁ గల్గి కాముకులకున్ రతి స్త్రీ లొదవింతురిత్తఱిన్. 18

మత్తకోకిల.

మెఱుఁగుదీవయు నింద్రచాపము మేలిసొమ్ములు గాఁగదున్
మెఱసి నీరభరంబు దాలిచి మింట మబ్బులు గ్రాలఁగా
మెఱయు వజ్రము లొప్ప దుద్దులు మేఖలల్ గలయాఁడువా
రఱిముఱిన్ భువిఁ గ్రాలఁ బాంథుల కంతరంగము నిల్చునే. 19

తే.గీ. నాతి ! నవకేసరకదంబకేతకీసు
పుష్పమాలలు కొప్పులోఁ బొందుపఱచి
కొడిసెపూలవతంసముల్ కోర్కెదీరఁ
జేసి దాల్చిరి భామలు చెవులలోన. 20

మత్తకోకిల.

బొబ్బవెట్టుమొగుళ్ళఁ గన్గొని ప్రొద్దుగుంకెడువేళనే
దబ్బుదబ్బున మంచిగందము తన్వులందు నలందికొం
చుబ్బి ఘుంఘుమలాడుపువ్వుల నొప్పఁ గొప్పుల దిద్దుచుఞ్
గుబ్బెతల్ తమపడకటిండ్లను గోర్కెఁ జేరెద రల్లదే. 21

సీ. కలువరేకులఁబోలె నలనల్లనై నీటి బరువుచే నాక్రింత వంగివంగి
యల్లనల్లన వీచు చల్లగాడ్పులచేత నందిందు మెల్లగా నాడియాడి
నవరత్నములసొంపు నవఘళించి వెలుంగు నింద్రచాపముతోడ నెనఁగియెనఁగి
వింతకాంతులతోడ వెలుగొందుమబ్బులు కంటికింపైమింటఁ గ్రాలఁగ్రాలఁ
బతివియోగానలము చేతఁ బరితపించు
పాంథపురుషునికూరిమి భార్య చిత్త
మపహరింపంగఁబడినట్లు లయ్యె నిప్పు
డకట వింటివె పరమకళ్యాణి చెలియ. 22

సీ. నిండారఁబూచిన మెండైన కడిమిచెట్లొక్కవంకలీలతో నొప్పుచుండ
నలగాలి కిట్టట్టు లల్లాడుఁ గొమ్మలుగలచెట్టు లొక్కచోట వెలయుచుండఁ
జందమామ వెలుంగు నందంపుఁగొనలచేఁ గేదంగులొక్క దిక్కుఁ గెరలుచుండఁ
దొలకరివానలో జలకంబులాడఁగాఁ గాంచి తాపంబెల్లఁ గడచుచుండ
నల్లయుపవనలక్ష్మి తా నాత్మలోన
సంతసించుచు నృత్యంబు సలిపిసలిపి
యలరి కలకల నవ్విన యట్లు తోఁచె
నహహ వింటివె పరమకళ్యాణి చెలియ. 23

తరల. పొగడదండలు జాజిదండలు పువ్వుబోండ్లకుఁ గొప్పులఞ్
మిగులఁబూచిన క్రొత్తపువ్వులు మేలిగోరఁటమొగ్గలుఞ్
దగఁగదంబసుమంబులుఞ్ జెవితమ్మిలం బ్రియనట్లుగాఁ
జిగురుబోఁడిరొ వానకాలము చేర్చుచున్నది చూచితే. 24

చ. చెలియరొ చక్కనిగుడు చిక్కనిచన్నులమీఁద హారముల్
వలుదపిఱుందులందుఁ గడుఁబల్చని తెల్లనిపట్టుచీరలుఞ్
లలితములైనవళ్ళుగల నద్దుల నూతనవర్షకారణం
బుఁ దగ మొల్చునారులును ముద్దుగ నారులు గారదే. 25

మత్తకోకిల.

సలిలనూతనసంగమంబున స్వాంతమెల్లను జల్లనై
లలితపుష్పవినమ్రమాలతలన్ నటించి రమించి వే
యెలమిఁగుల్కుచుఁ గేతకీరజమింపుఁ బెంచు సుగంధియై
కలికి పాంథుల స్వాంతమెల్లను గాల్చె వాయువు చూచితే. 26

చ. వనితరో నీటిభారమున వంగిన మా కిది పెద్దయాశ్రయం
బని జలనమ్రమేఘచయ మల్లన నీరము చల్లుచుం బలే
యనువున గ్రీష్మకాలచటులానలతీవ్రశిఖాళితప్తమై
చనియెడు వింధ్యపర్వతముఁ జల్లనచేయుచునున్న దల్లదే. 27

మత్తకోకిల.

కామినీజనచిత్తహారియు క్ష్మాజశాఖలతాళి పో
రామిచుట్టము ప్రాణికోటికిఁ బ్రాణభూత మశేషమా
భూమియందు ననేకసద్గుణపుంజసుందర మీవుతన్.
వేమఱున్ దగ వానకాలము నీకు శోభనపుంజముల్. 28

మ. చన శుభ్రంబగు తెల్లఁజీరయు మనోజ్ఞంబైన యబ్జాస్యముల్
దనరన్మ్రత్తిలునంచపిండురొదయందంపం దెచప్పుళ్లు నూ
తనపక్వాంచిత శాలిశోభతనుగాత్రం బొప్ప సొంపైన శో
భనపుం బెండ్లికొమార్తెవోలెఁ జెలియావచ్చెన్ శరత్తిప్పుడే.

మత్తకోకిల.

తెల్లఁబువ్వులభూమి చుక్కలతోనిచేతను రాత్రులున్
దెల్లగల్వలచే సరస్స నదీజలంబులు హంసచే
నల్లఁబువ్వుల వంగినాత్నొకయాఁక నంట్లవనాంతముల్
తెల్లనై ప్రమదావనంబులు తెల్లనయ్యెను జాజులన్. 2

చ. మెఱుఁగగు తళ్కుచేఁపలవి మేల్మొలనూళ్ళుగ నీళ్ళు వారఁగా
ముఱియుచు నాడు హంసతతి ముత్యపుహారపుఁబిందుగాఁగ దుర్
ఁజెవిసుసైకతంబులవి పెద్దపిఱుందులుగా నదుల్ బలే
ముఱిముఱి మంగయానమున ముద్దులగుమ్మలఁ బోలెఁబోయెడిన్. 3

తే.గీ. రజత శంఖ మృణాల గౌరంబులైన
నీరదంబులు చులుకనై నీటిలేమిఁ
బలువిధములౌచు గాలికిఁబాఱ మిన్ను
రమణ వీచోపులందెడిరాజుఁ బోలె. 4

తరల. మెఱుఁగుఁ గాటుక కాంతిచేతను మిన్ను మిక్కిలి సొంపుగా
మెఱయుమంకెనపూలచేతను మేదినీతల మెఱ్ఱనై
మెఱయఁగా వరిసైరుదౌసిరి మించి చేలిల నెల్లెడన్
మెఱయ వేడుక యేకుమాళ్ళకు మేదినిం జనియింపదే. 5

మత్తకోకిల.

చల్లగాలికిఁ గొమ్మలాఁకులు చక్కఁగాఁగదు మెల్లగా
నల్లలాడఁగఁ బల్లవాగ్రములందుఁ బువ్వులు పుట్టఁగా
నల్లనల్లన గండుఁదుమ్మెద లానఁదేనియఁ గాంచనం
బుల్లసిల్లుచుఁ గాల్వ దెవ్వని యుల్ల మియ్యాలనెచ్చెలీ. 6

ఉ. ఎన్నఁగఁ దారలెల్లఁ గడు నెన్నికసొమ్ములు గాఁగ మబ్బుచే
భన్నముగాక వెల్గునల చందురుబింబము మోముగా బలే
వెన్నెల తెల్లచీరగను వేడుకకత్తియ వోలె రాత్రియో
సన్నుతగాత్రి తాఁ బెరుఁగసాగడు నేఁడిదె నాఁడునాటికిన్. 7

ఉ. కన్నియలేళ్ళు ముకుళలను గట్టనచేయుతరంగజాలముల్
క్రన్నన నంచబెగ్గురులు గ్రాలెడుతీరముఁ బద్మరేణుసం
ఛన్నత నెఱ్ఱవడ్డజలజాలము గల్గి వెలుంగునేళ్ళు తా
మెన్నఁగరాని సంతసము నిచ్చెడు హంస రొదల్ చెలంగఁగన్. 8

ఉ. కన్నులపండువై హృదయకంజపుటంబు హరింపఁగల్గు న
వ్వెన్నెలగాయువాఁడు నలివేణిరొ చల్లనివాఁడు దెల్లనౌ
వన్నెహిమాంబువుల్ గురియువాడయి కాల్చె మఱింత చూచితే
వెన్నెలఱేఁడు తా విరహవేదనఁ గ్రాఁగు సతీశరీరముల్. 9

మ. ఫలభారానతభాగ్యశాలినిని వహ్వా యీపుడుం బూవుబం
తులభారంబున వంగియున్నలతఁ దోడ్తోఁ బ్రేమ నాడించుచున్
విలసత్ఫుల్లపయోరుహాస్యఁ గలఁపన్ వే పద్మినిం దా మహా
బలుఁడన్ దక్షిణుఁ డేరి కూరుజితరంభా తప్పవే నెమ్మదుల్. 10

చ. మదమున హంసదంపతులు మక్కువతో విహరింపుచుండఁగా
నదమలమైన యుత్పలకిసాలయముల్ వికసించి పర్వ స
మ్మదపుఁ బ్రభాతవాతమున మందగతిం గెరటంబులాడఁగా
బొదలుసరస్సులం గనినఁ బుట్టదె మోదము వేగమే చెలీ. 11

చ. మగువరో యింద్రచాపము లమబ్బులలోననె డాఁగియుండె నా
గగనపతాకయా మెఱుము గానఁగరా దిపుడెంత చూచెనే
నెగురవు ఱెక్కలార్చుచు నొకింతయు మింట బలాకపక్షులున్
గగనము కేసి చూడవు మొగంబుల నెత్తి నెమళ్ళు నెచ్చెలీ. 12

చ. వెడవిలుతుండు నాట్యములు వీడినయట్టి నెమళ్ళ విడ్చి తా
వడివడిఁగొల్చె శ్రావ్యముగఁ బల్కులుపల్కెడు రాజహంసలన్
గడవను గొండమల్లియను గడ్మని మద్దిని నేలుమద్దినిన్
విడిచి సుమోద్గమంపుసిరి వేగమ గొల్చెను సప్తవర్ణమున్. 13

చ. పరిమళవాసనాలహరి పర్వెడు వావిలిపూలచే మనో
హరమయి స్వస్థవృత్తిగల యండజపఙ్క్తులయాటపాటలన్
గరము ప్రతిధ్వనించు చలకంచెలఁ దాఱు మృగీదృగుత్పలో
త్కరముల సొంపుగాంచి ప్రమదావనముల్ ప్రియమిచ్చె నెచ్చెలీ. 14

క. తమ్ములఁ జెంగల్వలఁ గుము
దమ్ములఁ బత్రాంతహిమముఁ దగ నూఁపుచు శై
త్యమ్మొంది వానిసంగతి
సమ్మదము ప్రభాతవాతజాత మిచ్చెన్. 15

మ. వరిపైరుల్ తగఁ బండియున్నయెడలై స్వస్థంబుగా గోకులం
బరయన్ నిల్చినశోభగాంచునెడలై హంసంబులుం బగ్గురల్
చెరలాడంగఁ బ్రతిధ్వనించు నెడలై సీమాంతరంబుల్ ఒలే
ధరణిం జూచినవారికెల్లఁ గడు మోదం బిచ్చెఁగా నెచ్చెలీ. 16

ఉ. ఎక్కుడొయారముం గనియె నింతులనెన్నడకంటె హంసముల్
మిక్కిలికాంతి పద్మములు మేకొనెఁ దన్ముఖచంద్రుకంటె సొం
పెక్కినకైపుఁగన్నులకు నెక్కువయయ్యెను నల్లకల్వలా
దక్కని బొమ్మముళ్ళఁ గని సన్ననినైనతరంగముల్ నగెన్. 17

శా. పువ్వుంబోఁడులు దాల్చు భూషణములన్ బోల్పొందు నబ్బాహులన్
నవ్వం జొచ్చె సుమప్రవాళభరితానమ్రంపు శ్యామాలతల్
పువ్వుంబోఁడుల దంతకాంతి విశదంపుం జంద్రికాహాసముల్
నవ్వంజొచ్చె నశోకపుష్పయుతమై నవ్యంబులౌ జాజులున్. 18

మ. తనరం దీర్ఘము నీలమౌ కురులఁ గాంతల్ వ్రేలిముళ్ళేసి వే
ణి నిరూపించుచు జాజులం దురుమఁగా నిండిచ్చె నవ్వేణికిన్
ఘనమౌ వన్నె పసిండిదుద్దులొలయంగాఁ గర్ణరంధ్రంబులం
దునుపన్ బత్తెఱఁగైన నల్లతొవ లోహో నిండెఁగా వీనులున్. 19

చ. చనుఁగవపై ధరించి కడుఁ జక్కగ గందము తారహారముల్
ఘనమగుశ్రోణిమీఁదఁ జిఱుగంటల మేల్మొలనూళ్ళు దాల్చి యా
వనజపదంబులం దొడిగి వాసిగ గల్లలలాడు నందియల్
వనితలలంకరించికొనువారలు వేడుకలార నెచ్చెలీ. 20

ఉ. విచ్చినతెల్లగల్వలును వింతగఁ గ్రాలెడు రాజహంసలున్
బచ్చలవన్నె నీళ్లులును బర్వుకొలంకుల యందమైన యా
లచ్చిని దాల్చె మిన్ను విమలంబయి యిప్పుడు మేఘహీనమై
యచ్చపుఁ జందమామయును నచ్చపుఁజుక్కలు వెల్గుచుండఁగన్. 21

చ. కలువలసంగమంబు గనఁ గాంచుటఁ జల్లన గాంచి వాయువుల్
జలదములేమిచే దిశలు చామరొ పంకము లాఱె భూమియున్
గలుషమువోయి నీళ్లు దెలికాంతి వహించిన చంద్రతారకల్
గలుగుటఁజేసి యాకసము కాంత మనోహర మయ్యెఁ జూచితే. 22

ఉత్సాహ. తెల్లవాఱు సూర్యకిరణదీప్తి లేపఁ దమ్మిపూ
లల్ల మేలిపడుచు మోమునంద మొంద విచ్చెదున్
జల్ల చందమామ గ్రుంకఁ జయ్యఁ గల్వపూలగుం
పల్ల పాంథభార్య మందహాసమట్లు మొగిడెదున్. 23

మత్తకోకిల.

తెల్లవన్నియ కల్వపువ్వు మదించి పల్కెడు నంచ సం
ఫుల్లమై తగు మేలి మంకెన పువ్వుఁజూచి స్వభార్య వా
చల్ల తెల్లని కన్నుచెల్వును జాఱు వామొలనూలు రం
జిల్లు మోవియు నంచుఁ బాంధులు చింతనేడ్చెద రల్లదే. 24

మత్తకోకిల.

వారిజాక్షుల మోము నవ్వెడు వారిజారిసిరుల్ బలే
వారియందెల మ్రోత హంసలవాసిపల్కులు నవ్వెదున్
వారియెఱ్ఱని మోవి నవ్వెడు వాసికెక్కిన మంకెనల్
శారదాగమలక్ష్మిసొం పతిసమ్మదం బొదవించెదున్. 25

ఉత్సాహ. వికచకమలవక్త్ర యౌచు వికసితోత్పలాక్షి యై
వికచనూత్నకాశపుష్పవిశదవస్త్ర యౌచునున్
వికచకుముదకాంతి యౌచు వేడ్కకత్తెయో యనన్
బ్రకటముగను శోభనము శరత్తు మీకు నిచ్చుతన్. 26

మ. తనరన్ లేఁజిగురాఁకు లుల్లసిల నత్యంతంబు రమ్యంబుగా
గను పైరుల్ వికసింప లొద్దుగలు పక్వంబై వరుల్ పర్వఁగా
వనజంబుల్ ముకుళింపఁగా హిమము వే వర్షింపఁగా నెల్లెడన్
జను దెంచెన్ దగ శీతకాల మిదిగో శాతోదరీ చూచితే.

ఉ. కొమ్మ మనోహరమ్ములయి కుంకుమరాగముచేత నెఱ్ఱనై
యిమ్ముగ నిందుకుందహిమహీరసమానములైన హారముల్
సమ్మతిఁ దాల్చువారు తమ చన్నులమీఁదను శోభనాఢ్యమై
తిమ్మిరిదాల్చు చన్నుఁగవదీమస మొప్పు విలాసినీమణుల్. 2

చ. నునుఁజిగురాఁకుబోఁడుల మనోహరమైన సుబాహులందుఁ గం
కణ భుజకీర్తు లెవ్వియును గానఁగరావు పిఱుందులందునన్
గనఁబడ చయ్యె వేడ్క కయినన్ మృదునూత్నదుకూలచేలముల్
ఘనమగు చన్నుదోయిపయిఁ గానము సన్నపుటుత్తరీయమున్. 3

తరళ. ఒనరఁగా నలయంచపలుకుల కుద్ది యయ్యెడు నందియల్
వనజకాంతి హరించి వెల్గెడుపాదపద్మములందునన్
వనిత రత్నము లొప్పఁ జెక్కినపైఁడిగంటలఁ జిత్రమై
తనరు మేల్మొలనూళ్పిఱుందులఁ దాల్ప నొల్లరు గుబ్బెతల్. 4

చ. సురతమహోత్సవంబునకు సుందరులెల్లను సంబరంబుతోఁ
బరిమళవాసనాలహరి పర్వఁగ మేన నగర్లలంది చా
తురి మెఱయన్ లిఖించి ముఖతోయజమందునఁ బత్రముల్ మనో
హరమయి పొల్చువేణి కసితాగరు ధూపము వేయువారదే. 5

చ. సురతపుభార మంది కడుఁ జొక్కుచు సోలుచు మోము వెల్లనై
గురుతరమైనసంతస మిగుర్పఁగఁ గాంచియుఁ బెద్దనవ్వులన్
దరుణులు నవ్వరైరి నిజనాథులు పల్మొనఁ గాసిసేయుటన్
గరమును నొచ్చు మోవిపయి గంటులు రేగునా యన్భయంబునన్. 6

ఉ. ఉన్నతమైన చన్నుఁగవ నొప్పుచునున్నది వక్ష మిందు నే
నున్న శుభం బటం చరిగియుం గుచమర్దనజాతఖేదుఁడై
క్రన్నన గడ్డినుండి డిగఁ గాఱఁ దొడంగెడు మంచుబొట్లచేఁ
బన్నుగ నేడ్చెనో యనఁగ భాసిలె శీతవిటుండు వేకువన్. 7

మత్తకోకిల.

శాలిసస్యము లీని మిక్కిలి చక్క నొక్కెడఁ బర్వఁగా
నోలిఁ జక్కని యాఁడులేఁడుల యూథ మొక్కెడ నాడఁగాఁ
జాలనింపుగఁ గ్రౌంచనాదము చయ్య నొక్కెడ మ్రోఁగఁగా
లీలసీమలు చిత్తమందు బలే రయొసంగడు వేడుకల్. 8

ఉత్సాహ. కరము విరిసినట్టి నల్ల గల్వపువ్వు లొప్ప సుం
దరముగా మదించి హంస దంపతుల్ విహారమున్
జెరిమె సల్ప నీర మెల్ల నిర్మలముగఁ జల్లఁగా
సరసు లార కొల్ల గొనెడు సరస మానసంబులన్. 9

ఉత్సాహ. మంచుచేత శీతమైన మారుతమ్ము లూపఁగా
నంచితముగఁ బండఁ బాఱి యార ప్రేంకణమ్ము కా
మించు పతి విదేశమందు మెలఁగుకతన మేను పాం
డించి వెలయు మించుబోఁడి రీవిఁ బాండు వయ్యెఁగా. 10

ఉ. కమ్మని పువ్వుఁగల్లు కడుఁ గమ్మనివాసన నోళ్లకీయఁగాఁ
గమ్మనియూర్పుగాలి కడుఁ గమ్మనితావి యొడళ్ళకీయఁగా
నిమ్ముగఁ గ్రింద మీఁదఁ బడి యెమ్మె భుజంగ యుగంబు పోలికన్
సమ్మతిఁ బవ్వళించెను జనమ్ములు కామరసానువిద్ధమై. 11

చ. నవనవ యౌవనోత్సవ సనాథలతాంగుల నైన నున్న నా
పవడపు మోవులం దగిన పల్మొనకాట్లను జక్కనైన చ
క్కవ గవఁ బోని చన్నుఁగవఁ గ్రమ్మి వెలింగెడు గోళ్ళనొక్కులన్
గువలయనేత్ర చూపఱకుఁ గూర్మిరతంబులు వెల్లడించెడిన్. 12

ఉ. అద్దము చేతఁగొంచు నొక యబ్జనిభాస్య ముఖారవిందమున్
దిద్దుచు లేఁతయెండ నిశి దీమసమొప్పఁ బ్రియుండు సారమున్
జొద్దయుఁబీల్చి పల్మొనలఁ జేసిన గంటులు పెటి వీడఁగాఁ
దద్దయునొప్పు మోవి వివిధంబుగఁ జూచును వ్రేళ్ళఁబట్టుచున్. 13

ఉ. ఒండొక పువ్వుబోఁడి సురతోగ్రతచే నొడలెల్ల డస్సి తా
మెండుగ రాత్రియెల్ల రతి మేలగునుట న్నయనంబు లెఱ్ఱనై
మండఁగఁ గొప్పువీడి భుజమండలిఁ దాండవమాడుచుండ నీ
రెండ ప్రభాతవేళ మెయికింపుగఁ దాఁకఁగ నిద్రవోయెడిన్. 14

మ. రమణీయంపు సువాసనల్ జనిన నిర్మాల్యంపుఁ బూమాలికల్
దమమూర్ధంబులనుండి డుల్చి ఘననీలంబౌ శిరోజాంతముల్
రమణీయంబుగ దుల్పి గుబ్బచనుభారంబౌట మైవంచుచున్
రమణుల్ కొందఱు కొప్పువెట్టెదరదే రామామణీ చూచితే. 15

చ. ప్రియపతి తెస్సగా ననుభవించినదౌ తనమేను గాంచి వే
ప్రియమును హర్షమంది పెదవిన్ సవరించుచుఁ జక్కఁగన్పడన్
నయనములందు ముంగురులు నల్లగ వ్రేలఁగ ఱెప్పవాల్చుచున్
అయిక ధరిరించె నొక్కసతి అద్దములు మైఁ గనరాక యుండఁగన్. 16

శా. ఇంతుల్ కొందఱు తమ్ము భర్త రతి నెంతేసేపు భోగింపఁగా
నెంతో చెమ్మటపట్టి మేనిలతయొంతేనూనమై పర్వఁగా
నెంతేఁ బెన్గొడలం బయోధరములం దేపార రోమాంచముల్
సంతోషంబున నాడఁ జొచ్చిరి దెచూ స్నానంబుపన్నీటితో. 17

చ. రమణుల కింపుఁ బెంచి బహురమ్యగుణంబులనొప్పి శాలిధా
న్యములను జేల నెల్లెడల నందముగాఁ గడుఁ బండఁజేసి క్రౌ
చముల సమూహమున్ బఱపి సర్వమనోహరమై నెలుంగుచున్
హిమయుతమైన యీఋతు వనేకసుఖంబుల మీకు నీవుతన్. 18

## శిశిర ర్తువు.

చ. మొలిచిన శాలినాములఁ బ్రమోదకరంబయి యచ్చటచ్చటన్
గలిగిన క్రౌంచపక్షులనినాదములన్ గడు నొప్పిదంబునై
యల వలరాచవియ్యముల కాకర మౌచును నాఁడువారి క
గ్గలమగు వేడ్కగా శిశిరకాలము వచ్చెను గంటె నెచ్చెలీ.

ఉ. కొందఱు నిప్పు డగ్గఱఁగఁ గొందఱు వెచ్చని యెండలోనఁ గూ
ర్చుందురు తల్పుమూసికొని చొప్పడనుందురు లోపలింటి లోఁ
గొందఱు మొద్దుబట్టలను గొందఱుదాల్తురు శోభనాంగులన్
గొందఱు కౌఁగిలించెదరు కొమ్మరో నేఁ డతిశీతబాధచేన్. 2

ఉ. వెన్నెలవోలెఁ జల్ల నయి వెల్గెడు కమ్మని మంచిగంధమున్
వెన్నెలపర్వ శుభ్రమయి వెల్గెడు మేడలపృష్ఠభాగముల్
సన్నముగాని మంచునను జల్లనఁ గాంచిన సన్నవాయువుల్
సన్నుతగాత్రి! నెమ్మదికి సమ్మద మీ వివు డెట్టివారికిన్. 3

ఉత్సాహ. మన్ను మిన్ను నేకమగుచు మంచు గురియ దానికిన్
సన్నుతాంగి సాయ మల్ల చందమామ కాయఁగా
వెన్నెలలను జుక్కలెల్ల వెల్లవోయి మాయఁగా
నెన్నరాని చలిని రాత్రు లింపు గావు నరులకున్. 4

చ. ఒడలికిఁ జందనం బలఁది యొప్పఁగఁ గొప్పునఁ బూలు వెట్టి మేల్
విడియము వేసికొంచు సురలెస్సదనంబున నోళ్ళనుండి వే
వెడల సువాసనల్ సతులు వేడుక లారఁగఁ బడకటిండ్లలో
బుడిబుడిఁ జొచ్చువార లటఁ బొంపిరివోవఁగ ధూపవాసనల్. 5

ఉ. తప్పులు సేసిరేనియును దర్జనచేయ భయంబు నెమ్మదిన్
ముప్పిఱియాచు నెక్కొనఁగ ముందట నిల్చి వడంకు మేనితో
నొప్పెడు భర్తలం గని మదోన్నతి నెక్కొను స్త్రీలు వారివా
తప్పులు సైతు రప్డె సురతంబున యం దభిలాష మెండుగన్. 6

చ. కనికర మింత లేక కడుఁ గామమదంబున దీర్ఘరాత్రులం
దునఁ దమి యౌవనంబు గల ధూర్తులు పెద్ద రమింప లేఁత జ
వ్వనులగు నాఁడువారు బహుభంగుల బొమ్మలు నొచ్చుచుండ న
ల్లనఁ జనువార లల్లదె విలాసమున౯ నిశి తెల్లవాఱుదు౯. 7

ఉ. ఉబ్బెడు గబ్బిచన్నుఁగవ నొత్తిలినొక్కుచు పైకగట్టుచు౯
బ్రబ్బిన బొమ్మపైన నెఱపట్టుపటంబు ధరించినీటుగా
గొబ్బునఁ బూలనేకములు కొప్పునఁ దాల్చుచు నాఁడువారలో
యబ్బ యలంకరించిరి హిమాగమకాల మనంగ నొప్పిరే. 8

చ. మెఱుఁగగు కుంకుమంబలఁద మిసమిసలాడు పసిండివన్నెతో
మెఱయుచు సేవ సేయఁ దగి మేలగు పచ్చఁదనాన వెచ్చనై
విరివిగఁ బర్వు చన్గవల వేడుకకత్తెలఁ గౌఁగిలించి వే
ఱెజియలు సేసి శీత మతివా పవళించిరి నేఁడు కాముకుల్. 9

మ. మది కింపై కడుశ్రేష్ఠ మౌచు మదనోన్మాదంబు రత్యుద్ధతి౯
బొదలంజేయఁగ నోపుచు౯ బరిమళంబుల్ గల్గి యుప్పొంగు న
మ్మదనీయంబగు కల్లు ద్రావెదరు భామల్ తాము భర్తల్ మహా
హృదయాహ్లాదకరంబు గాఁగఁ గమలాక్షీ కల్పె పూపూఁదుచు౯. 10

చ. తెఱవయొకర్త క్రొవ్వుతమి తృప్తియుఁదీఱఁగఁ దెల్లవాఱఁగా
గురుకొని కౌఁగిలించి చనుగుబ్బమొనల్ పతిబొమ్మ గాడఁగా
ముఱియుచు భోగచిహ్నములఁ బొందినదౌ తన మేను గాంచుచు౯
జిఱు చిఱు నవ్వులొప్పఁ దన సెజ్జగృహంబున నుండి వచ్చెడి౯. 11

ఉ. ఒండొక శోభనాంగి యరుణోదయమందున శయ్య డిగ్గి పూ
దండలు రాల దుల్చి నిరతం బసితాగరుధూపవాసనల్
మెండుగఁ గొట్టఁ బెన్నెఱులు మెల్లన నార్చుచుఁ జీరగట్టుచు౯
బండువు గాఁగ వచ్చెనదె వల్దపిఱుందుల నాడఁజేయుచు౯. 12

చ. కడిగిన స్వర్ణపంకజముఖంబులు వీనులలోని చిల్లులన్
విడివడి తొంగి చూచి కడు వెల్గెడు కన్నుల కెంపుఁగొలుకులున్
వడిగ బుజాలపై నడరు వాలుదుఁగొప్పులు దాము నిండ్లలోఁ
బడఁతులు కూరుచుండి రతివా గృహలక్ష్ములఁబోలె వేకువన్. 13

చ. అతిపృథువౌ పిఱుందులను నంతకు మించిన గుబ్బచన్నులన్
సతి ! యడఁగాలు నెన్నడుమునన్ జనువారయి మెల్లమెల్లఁగా
రతిసమయానుకూలమగు రాత్రివేషము దీసి నీటుతో
డుతఁ బవలింటి వేషము గడున్ దరుణుల్ వెసఁ దాల్చువారదే. 14

చ. రమణులు అక్కిఁ గిల్లఁగను రంజిలు చన్నులు కంటఁజూచియున్
గ్రమమఱి వారలే కఱువ రంజిలు మోవులు పట్టిచూచియున్
దమమది కెక్కు వారిదగు తద్దయుఁ బ్రేమకు సంతసించుచున్
రమణి యలంకరింతు రదె రామలు మోములఁ దెల్లవాఱఁగన్. 15

ఉ. ఎక్కడఁ జూచినం జెఱకు లింపగు బెల్లపువంటలున్ బలే
చక్కసివడ్లు మన్మథుని చక్కనియాటలు వానిగర్వమున్
మిక్కుటమౌచు నవ్విరహిణీజనతాపము మిక్కుటంబుగా
నెక్కుడు మీకు శోభనము లీశిశిరాహ్వయకాల మీవుతన్. 16

—* గద్య *—

ఇది శ్రీ తాడూరి లక్ష్మీనరసింహరాయ పండిత ప్రణీతంబైన
ఋతుసంహారము.

శ్రీరస్తు.

# నీతికథామంజరి.

## ౧. గర్వము, (గీతములు.)

౧. ఇద్ధరనుగర్వమనుబీజమెల్లవారి । హృదయసీమలఁబడిమొల్చియెదిగియావ।
రించిసుగుణాంకురంబులనెదుగనీదు । కట్ట! కట్టఁడిబ్రహ్మయేగతిసృజించె॥

౨. గర్వపడుటెన్నటికినైనఁగాదుసుమ్మి । బలిమిచేయవనంబుచేఁగలిమిచేసు।
విద్యచేరూపుచేనిట్లుపెక్కుగతులఁ । బొడముచున్నదిగా! దానినడఁపవలయు॥

౩ రక్తమాంసములెందాకఁబ్రబలుచుండు । నంతదాకబలంబుమైనలరుఁబిదప।
వృద్ధదశవచ్చికాలూనవీలులేని । యప్పుడేబలగర్వమో చెప్పుమయ్య॥

౪. తలఁపనేపుట్టనేపాముగలదొ! యన్న । యట్టులెవ్వరికేయంశమవగతంబొ।
యకట! యొక్కనికంటెవేఱొకఁడుగొప్ప । వాఁడుగావచ్చువిద్యయెవ్వారిసొమ్ము॥

౫. సంపదలుశాశ్వతంబులా! చాలుమబ్బు । నమ్మిక్రొననీళ్లుదెగఁగొట్టినగతిసుమ్మి।
కలిమిలేములుప్రజలకుఁగాలవశము । లవునువెన్నెలచీకటులట్లమిగుల॥

౬. గర్వమనునంధకారంబుకనులఁగప్ప । నెదిరిఁదన్నునెఱుంగఁడింతేల! తొంటి।
తనయవస్థఁదలంపఁడింతయునునన్యుఁ । డెంతవాఁడైనమన్నింపఁడెంతవింత!॥

౭. కాకియొక్కటొకానొకకాఁపువాని । యింటనెంగిలిమెదుకులనేరిమెసవి।
చియ్యబట్టియేరిసరకుసేయకిచట । నచటఁదిరుగుచునుండియొయ్యారమొప్పు॥

౮. ఎదుటఁజక్కనినడకలనేగుదెంచు । నంచఁగనుఁగొనియొఱసియొక్కించుకేని।
వెఱవకిటుదారిఁదొలఁగవేవెరవటంచుఁ । బైవచింపఁదొడంగెగర్వంబుగ్రమ్మి॥

౯. అంచయాకాకిమాటయాలించియేల । యిట్టులాడెదవోకాకి! యెవరిదారి।
యిదియెఱుంగవో! యొఱసిననీవుపైగ । వాదులాడుదె! వినయంబువలదె! సుంత॥

౧౦. అనుచునొక్కింతకోపించియనియెఁగాకి । కాఱులఱచెదవేమి? నాగతులనాప।
జోడువాఁడవె! నీవంటినీడజంబు । లెన్నొసరిరాకమడసెనీవెంతయన్న!॥

౧౧. అందఱునునన్నుఁబక్షిరాజందురిప్పు । డీసడించితివీవుపోనిమ్ముకొంత।
నడచిచూతముపత్తువె? జడధిమీఁద । నంచునంచవచింపనియ్యకొనికాకి॥

౧౨. తరలిబిరబిరనరిగె సత్వంబుగలుగు । దనుకనంచయు నెమ్మదిఁజనియె వెనుక।
నిటులఁగొండొకవడిచననీఁదు గాళ్లు । వడియెఁగాకికి ఱెక్కలబలిమిదప్పి॥

౧౩. అంచతనమృదుగమనమొక్కించుకేనిఁ । దప్పకుండఁగఁబోయియంతటనుగాంచి।
కాకి! నీగతి నాగతికంటె! యిపుడు । వనధిలోఁబడ్డ నేమాదువనికుదించి॥

౧౪. తనదు ఱెక్కలపైనిడిదయదలిర్పఁ । దెచ్చియొడ్డునడించినీయిచ్చఁబొమ్ము।
తెల్వివినయంబుగుణమని తెల్పిపోయె । హంస, లజ్జించివాయసమవలఁజనియె॥

౧౫. గర్వమునఁజాలనష్టముల్గల్గుఁదనసు । గుణములలరినకొలఁది నెక్కువగువినయ।
వృత్తిఁజేకొన్నవన్నియు వెట్టుమిగులఁ । బైఁడికినిమానికంబుతోడ్పడినమాడ్కి॥

## ౨. నిజము, అబద్ధము, (గీతములు.)

౧. ఒకనియొద్దహుళిక్కినానొక్కనాక । రుండెఁదడవులనుండివాఁడొక్కనాఁడు.
మించియజమానుహద్దుఁదప్పించుకొనిత । నంతబైలువెడలెవ్రీడసుంతలేక॥

౨. ఆహుళిక్కియవలఁబోయినంతటయజ । మానుఁడదిగనియద్దిర! మనయజాగ్ర।
తవలనఁగదాయితండిట్లుదాటెనెవరు । తిరుగమనకట్టుబాటులై తెచ్చువారు!॥

౩. ఎట్టులోయని డెందమందెంచిమిగుల । వడిగవెంబడిఁబరుగెత్తిపట్టఁగలని।
బద్ధియనునట్టిమతియొకబంటుఁబిలిచి । యపుడుయజమానుఁడతనితోననియెనిట్లు॥

౪. కంటివయ్యనిబద్ధి! నాకట్టుబాటుఁ । దప్పిహుళ్లక్కియనునొకరిప్పుడెయెటొ।
పాఱిపోయెనువానినిబట్టుకొనని । యెడలజనులకుపద్రవంబెంతొసేయు॥

౫. కానవేవేగనీవేగివానిఁబట్టి । తోడితెమ్మిటులేదేనిఁదొడరివాని।
రూపుమాపియయినరమ్మురూఢిననియె । వెంటనెనిబద్ధియాతనివెంబడించె॥

౬. ఇట్టులుప్రయాణమొకదినమిద్దఱికిని । జరిగెనుహుళక్కితనకంటెసాగెముందు।
గావుననిబద్ధిమిగులవేగముగనడచు । వాఁడెయైననుశ్రమఁజెందిపట్టలేక॥

౭. ఆతఁడిప్పటికినిజిక్కుఁడయ్యెముందు । పట్టుబడుననునమ్మికపుట్టదయ్యె।
సహహ! హుళ్లక్కిమహిమమేమందు! నున్న । యట్టులేయుండిజగమెల్లనాక్రమించె॥

## ౩. రాజు, సన్యాసి, (గీతములు.)

౧. ఎంతొవిస్తీర్ణమైఫలవంతమైన । దేశమొకటేలుచుండెఁబృథ్వీశుఁడొకఁడు।
వానిభండారమునవెండిపైఁడిమణులు । పెక్కులున్నవిభృత్యులోవేలకొలఁది॥

౨. ఆతఁడే యడ్డులేక రాజ్యంబు నేలుఁ । గడఁకఁ జక్రికి మ్రొక్కు నిజము నితలను।
గలుగు కనకకిరీటంబు కట్టె మోపె । యనిన భాగవతోక్తి చొప్పు వనెకింత॥

౩. దైవభక్తియును లేకుంటఁ దనకునున్న । సంపదలు సర్వమును గడు సౌఖ్యదములు।
గాక పోవుటె కాదు దుఃఖమును గూర్చు । దైవభక్తి ప్రభావంబు దలఁపఁ దరమె?॥

౪. ఆప్రభుండేలు దేశమం దద్రిగుహము । హాశ్రమంబున నిల్చెన హర్నిశంబు।
తపము సల్పుచు నొకయతి దైవభక్తి । గలిగి కాషాయవస్త్రముల్గడు ధరించి॥

౫. ఆతని యనుగ్రహంబున నాత్మశాంతి । సాధనము నొందుకోర్కె నచ్చటికిఁ బోయి।
స్వామి! నాకు నతిస్థిర సౌఖ్యమెట్లు । గలుగుఁ! దెల్పుమనిన యతి పలుకకపుడు॥

౬. కొండపై కాతనిం దోడుకొనుచుఁ బోయి । యచట నెత్తగు శిఖరంబునం తెఁ జూపి।
గంటివే యేల? యటనొక గరుడపక్షి । గూడు కట్టుకొనునది నీకుం దెలియునె?॥

౭. అనిన నా రాజు గ్రహియించి యతనిఁ జూచి । స్వామి! తనకే యుపాయంబు సంభవింప।
దనుచు నెత్తైన చోనుండెనని యెనీవు । దానిఁగని తెల్విఁ గొనుమని మానిపల్కె॥

౮. చూడుఁడీ యట్ల చిరకాలసుఖముఁ బొందఁ । దలఁపుగలదేని నిహసుఖంబులకుఁ జొరక।
మనసులోపల నమ్మి దేవుని భజించి । పరసుఖంబులఁ బ్రమదంబుఁ బడయుఁ డెపుడు॥

## ౪. దొంగ, (గీతములు.)

౧. గడుసు దొంగయొకఁ డొకనడికి రేయి । వచ్చి గుఱ్ఱపుశాలలోఁ జొచ్చి యందుఁ।
గట్టఁబడియున్న గుఱ్ఱంబు కట్టు విప్పి । తోలుకొని పోయె నవలకు దూరముగను॥

౨. మఱుచటి దినంబునను యజమానుఁ డచట । గుఱ్ఱమును గానక యొమదిఁ గుందికుంది।
తనకు గుఱ్ఱంబు లేకయే పని జరుగమిఁ । గ్రొత్త గుఱ్ఱంబు సంతలోఁ గొనఁగఁ బోయె॥

౩. అపుడు పలువురు గుమిగూడి యచట గుఱ్ఱ । మొకటి బేరంబు సేయుచునుండఁ జూచి।
గుఱ్ఱమద్దితనదే యౌటగుఱుతువట్టి । దగ్గఱకుఁ బోయి మఱియును దఱిచి చూచి॥

౪. మొండి! యీగుఱ్ఱ మెచ్చటినుండి వచ్చె । నీకుఁ జెప్పు? మనుచు దానిని మురుచుండెఁ।
దిరిగ గుఱ్ఱంబు నమ్మఁగఁ దెచ్చినట్టి । వాఁడు నాయింట నేపుట్టె బాగుబాగు!॥

౫. గుఱ్ఱమును బోలి మఱియొక గుఱ్ఱముండ । వచ్చునని చెప్పి యప్పుడెవ్వరికో యమ్మఁ।
బోవ యజమానుఁ డూహించి మూసెఁ దనదు । రెండుచేతుల గుఱ్ఱము రెండుకనులు॥

౬. నీదె యీగుఱ్ఱమైనచో నిశ్చయముగ । దీనిదే కన్ను గ్రుడ్డిదో దెల్పుమన్నఁ।
గొంత తత్తఱపడి వాఁడు కొంచె మెడమ ! కన్ను గ్రుడ్డిదనుచుఁ బల్కెఁ గండుమీఱి॥

౭. వేగయజమానుఁడా చేయివిప్పిచూడు । మోయియనవాఁడుకుడిదనఁబోయియెడమ।
కన్నటంటినిదొందరగాననయజ । మానుఁడందఱుఁగంటిరే ! వీనిగుణము॥

౮. దీనికింగ్రుడ్డిలేదెందుఁగానిదొంగ । మాత్రమేకాదుబొంకులమారియాతఁ।
డంచురాజభటులకొప్పగించితనదు । గుఱ్ఱమునుదోలుకొనిపోయెఁగోర్కిమీఱ॥

౯. ఎంతనేర్పునమాయలనెన్నియేని । పన్నిననుదొంగలుతుదకుఁబట్టుపడక।
పోరుధర్మమెజయమువుమొదలమంచి । గుణముగలిగివర్తించినఁగొదువరాదు॥

## ౫. అవిధేయత, (గీతములు.)

౧. పిల్లయీఁగయొకటిదానితల్లితోడఁ । గూడియొకగోడమీఁదనుగోర్కివ్రాలి।
యుండెదానికిదగ్గఱనుడుకునీళ్లు । గ్రాఁగుచుండెనుకడవయొక్కటిచెలంగ॥

౨. పెద్దయీఁగయొకప్పుడుబిడ్డనెంతొ । వదలియెందులకోఁబోవవలసివచ్చి।
బిడ్డనుదరికిఁజేరంగఁబిల్చియిట్టు । లనియెమెల్లనమదిఁబ్రేమయావరింప॥

౩. బిడ్డ ! నేనొండుచోటికివెడలవలసి । వచ్చెనిన్నొంటివిడిచినేవచ్చుదనుక।
కదలవలదెచ్చటికినైనఁగానియిచట । నుండినీవున్నచోటనెయుండుమనియె॥

౪. అంతనాచిన్నయీఁగయోయమ్మయేమె । యిట్టులంటివనినఁదల్లియనియెముద్దు।
బిడ్డయల్లదెచూపట్టుపెద్దకడవ । యొద్దకేగెదవనిభయమొందియున్న॥

౫. పిల్లయదియాలకించియోతల్లియేల । వెళ్లరాదాదరికిఁజెప్పువేగమన్న।
దాననీవుపడుదువనితలఁచియంచుఁ । దల్లిపల్కెననేమనిపిల్లయడిగె॥

౬. ఎఱుఁగవోబిడ్డ ! నీవంటివెన్నొయిందుఁ । జొచ్చిచచ్చినకతమునవచ్చియిటువ।
చించుచుంటిననుభవంబెంచియంచు । బుద్ధిచెప్పియవలఁబోయెఁబెద్దయీఁగ॥

౭. పెద్దయీఁగతనకునిట్లుబుద్ధిచెప్పి । యెగిరిపోయినపిమ్మటనెడఁదఁదల్లి।
మాటలఁదలఁచికొనినవ్విపాటిసేయ । కడలియిట్టులఁదలపోసెబుడుతయీఁగ॥

౮. ముసలివాండ్రెప్పటికినిదామసముతోడ । నకటజాగ్రత్తజాగ్రత్తయందురేమి।
యిటునటువినోదముగనునేనెగురకుండ । నడ్డుపెట్టుచునుండెమాయమ్మయౌర॥

౯. ఎగురఱెక్కలులేవొ ? యియ్యెడనుబాటి । వలనఁదప్పించుకొనుబుద్ధిబలములేదొ ?।
యెట్టులీమాటలీకుండచుట్టుదిరిగి । యెగురుదునటంచుఁదెగువతోనేగెనటకు॥

౧౦. అపుడుకళపెళగ్రాగెడునట్టినీళ్ల । యావిరూపిరిరానీకయావరింప।
నొండెఱుంగకచచ్చెనాకుండఁజొచ్చి । తల్లిమాటలఁదలఁచుచుఁబిల్లయీఁగ॥

౧౧. తల్లిదండ్రులమాటలఁదవిలివినని । పిల్లలకునిట్టిగతిసంభవించుఁగానఁ।
బెద్దలందఱుఁజెప్పినసుద్దులెఱిఁగి । పెల్లుగామేలుపొందుఁడోపిల్లలార॥

## ౬. సంఘభీతి, (కందములు.)

౧. ఒకయూరనొకధనికునకు । సకలపదార్థములుగలిగిసంపదలకుఁదా।
నకమైవిశాలతలమగు । నొకయిలుగలదందునెలుకలుండెనుబెక్కుల్॥
౨. కలకాలమాతఁడాయెలు । కలకాయిడికోర్వలేకకలవిలపడిపి।
ల్లులఁబెంచిబోనులుంచియుఁ । బలుమాయలుపన్నివానిఁబట్టుకొనంగన్॥
౩. ఆమాయోపాయంబులు । తామునెఱిఁగిమూషకములుతప్పించుకయుం।
తేమెలఁగుచుండుటండా । నేమియుఁజేయంగలేకయెంతయుఁగుందెన్॥
౪. ఇటుకొంతకాలమరిగిన । యటుపిమ్మటనొక్కనాఁడహంకారముతో।
నెటులోయుందలియెలుకనొ । కటిఁజేకొనిదానిమెడనుగంటంగట్టెన్॥
౫. బిరబిరకలుగులలోనది । యరిగిననమ్మూషికమ్ములదిరిపడియిదే।
మిరక్రొత్తజంతువిచ్చటి । కరుదెంచుచుమనకుమృత్యువైయనిభీతిన్॥
౬. గంటగలిగినయెలుకతమ । కంటంబడినపుడెడేగఁగన్నపులుఁగులై।
తొంటియిరవువిడిచిమఱొక । యింటికెలుకలేగెనొక్కటేనియులేకన్॥
౭. అదిగనిధనికుఁడుమదిలో । ముదమందెనిఁకొంటిపాటుబొదవెననుచునె।
మ్మదినుండియింటగంటం । గదిసినయెలుకయుఁదనంతఁగంతులువైచెన్॥
౮. అనుదినమిటులింటనుగణ । గణయనిమెడగంటమొఱయఁగానుబ్బుచుఁజి।
క్కనవెల్లదించుఁదనకెం । దునుసరిలేదంచుగర్వదూషితమయ్యెన్॥
౯. కొంచకతిపగుటయుంగ । ర్వించుటయుంగాంచియింటిపిల్లియొకటిభ।
క్షించెనుదానినొకప్పుడు । మంచిదియనితలఁచెనుయజమానుండంతన్॥
౧౦. కావునసంఘమునకుభయ । మావిర్భవమందఁదిరుగునాతఁడవశ్యం।
బేవెతలనుబొందకపోఁ । డీవిధముందెలిసిబ్రదుకుటేయోగ్యమగున్॥

## ౭. ప్రలాపి.

౧. క॥ శీతాచలనికటంబున । శ్వేతాశ్వుండనునొకరుఁడుచిరతరసుగుణ।
ఖ్యాతుండునిఖిలసంప । ద్వ్రాతుండనధాత్రియందువన్నెకునెక్కెన్॥
౨. సీ॥ అతనికఖిలోపయోగమైనట్టివస్తు । వులనుజేపట్టుపరిపాటిగలదుగాన।
గుజ్జుమెద్దావుకునకముగొట్టెపంది । పెంపఁబడుచుండెనాతనిపెరఁటియింట॥

౩. చ॥ ఇటులొకకొన్నినాళ్లుచననెంతయునయ్యవిచియ్యబట్టిప్రా!
కటబలసంపదంగనిస్వకార్యములన్నెరవేర్చుచుండనా।
క్కటయజమానుఁడాపనులఁగన్గొనిసంతసమాత్మనొందిము!
నృటివలెఁగాకకూరిమిఘనంబయివర్ధిలఁబ్రోచుచున్నెడన్॥

౪. మ॥ ఒకనాఁడన్నియునొక్కచోనిలిచియత్యుత్సాహముందుండనూ।
రకదానుండకపందిపల్కెఁజెలులారా! మీకునాకిడ్డద।
ప్పకసంతోషముగల్గుఁగానిమనలోభావింపఁగన్పట్టెనం।
డొకభేదంబిదెనాకునేశ్రమములేదూహింపుఁడీమీపనుల్॥

౫. మ॥ మొదవుంబాలకుబాధవెట్టుదురుముప్పొద్దెద్దుబండ్లీడ్వులా।
గుదురెంతేబరువైనవైచినడకన్గుఱ్ఱంబునొప్పింతురిం।
పొదవంగొఱ్ఱెకుఁగత్తిరింపుదురుగాదోబొచ్చుఁగంబళ్లకే।
యదనంగావలియుండఁదప్పదుగదాయశ్రాంతమీలేపికిన్॥

౬. క॥ ఉపకారముచేమిమ్ముల । నపరూపానందసుఖమునందఁగనన్నిం।
గృపఁబ్రోచునుయజమానుఁడు । విపరీతములేదెమనకువీక్షించినచోన్!॥

౭. గీ॥ అనుచుఁబల్కుచున్నయట్టిపందినిగని । నీవుసుఖమునందుమీవిధంబు।
మాకులేకయున్నమానెఁబోనుపకృతి । లేనిబ్రదుకుబ్రతుకెక్షోణిలోన॥

౮. క॥ అనితక్కినజంతువులై । దునుబల్కెనఁబందితానెదొడ్డనిగర్వం।
చెనుమిగిలినవడఁకువఁదమ । పనులెల్లనొనర్చుచుండెఁబరిపాటిమెయిన్॥

౯. క॥ పదపడికొన్నాళ్లరిగిన । పిదపంగరువృకటివచ్చిపీడింపనతం।
డదనెఱిఁగినవాఁడవుట । న్మదిలోనూహించెఁదనుసమాచారంబున్॥

౧౦. గీ॥ ఆవుపాలకు, శునకముకావలికిని । గొఱ్ఱెబొచ్చున, కెక్కుంగగుఱ్ఱమెద్దు।
బండియీడ్చుటకైయింటనుండుటవిధి । యెందుఁబొందరియీపెద్దపందియేల!॥

౧౧. క॥ అనుచుంబందినిగెంటిం । చెనుగావునఁబెక్కులఱచుచెనఁటికిగలియా।
యనువునవునిదియునెఱిఁగి । కొనినెమ్మదిసంచరింపఁగోరికలాదవున్॥

## ౭. బీదసాదలవాదము.

౧. గీ॥ ధరణిఁగల్యాణకటకమన్పురమునందుఁ । గలదుసుందరియనునొక్కకలికియామె।
పూర్వపుణ్యవశంబునఁబొదలుచుండె । నతులసౌభాగ్యభాగ్యయోగ్యతలతోడ॥

౨. క॥ ఆకామినికేకొదవలు । లేకుండెనుగానిదురితలేశంబునఁజే।
పైకొనెనొకలోపంబది । ప్రాకటసంతానవైభవములేమిసుమీ॥

౩. క॥ ఆపడఁతియింటిచేరువఁ । గా పురమునం డెనొక చెలువకల్యాణి యనం।
బ్రాపించె నా పెకుదరి । ద్రాపదతనపూర్వదుష్కృతాంశమువలనన్॥

౪. గీ॥ కానియామానినికిని సంతాన మొక్క । కొడుకుకూఁతురుగలిగిరికూర్మివారిఁ।
గాంచియేతనకబ్బినఘనదరిద్ర । దశదలంపక యెట్లాయిద్దఱినిమనిచె॥

౫. గీ॥ పిల్లలునుబుద్ధివృద్ధులఁ బెంపుఁజెంది । తల్లిదండ్రులమాటలదాఁటకెపుడు।
చదువుచుండిరికల్యాణిసత్యవృత్తిఁ । గలిగిపతిభక్తి దేవసేవనల మెలఁగు

౬. క॥ ఓక నాఁడేదోపనితీ । రికతఱిఁగల్యాణి సుందరిగృహమునకుఁబోఁ।
గికుతించె మొదటి దెదుటిక । లికిఁగ స్గైని నీకునగలు లేవేమనుచున్॥

౭. గీ॥ ఆంతఁగల్యాణియమ్మాటలాలకించి । సకియనీకునువలెనాకుఁజాలయేల।
గలుగుదృశ్యమదృశ్యమై చెలఁగునట్టి । రెండుతొడవులుమాత్ర మెయుండెనమ్మ॥

౮. క॥ రమణీదృశ్యము సంతా । నమదృశ్యముభర్తృభక్తినమ్మయిదిని।
క్క ము గాని పెద్దనగలు । త్తము రాలిమనంబునకుముదంబుగొలుపునే॥

౯. గీ॥ అనినసుందరి నెమ్మొగమందువిన్న । దనముదోపఁగసిగ్గుచేతఁదలవంచె।
నచటిచెలికత్తెలెల్లనయ్యారెయనిరి । యవలఁబోయెనుగల్యాణిభవనమునకు॥

౧౦. క॥ ఎంతటి సంపదయుండిన । సంతానముభర్తృభక్తిచక్కఁబడనిచోఁ।
గాంతకుసంతోషము లే । దింతయునగలెల్లవానికెనరావుసుమీ॥

## ౯. పాటువలని నీతి.

౧. క॥ భువిలేమియ నెడుసతికు । ద్భవమందెనుబడఁతియొకతి పాటనఁగఁదదు।
త్సవములఁగనికొన్నాళ్లకు । దివికింజనెలేమిపాటుదీనావనరై॥

౨. గీ॥ కొంత కాలముకుగఁగొనకొనియభివృద్ధి । నందియొక్కబలియయునాశ్రయించి।
యవలఁగనియెఁదృప్తియారోగ్యమనియెడు । పుత్రి కాద్వయంబుముద మెలర్ప॥

౩. క॥ పాటుకుమార్తెలుతనతో । పాటుప్రవర్తింపనదరుపాటందకయు।
చ్చోటనివసించికొన్నా । ళ్లాటంకము లేక గడ పెనతి కాలంబున్॥

౪. క॥ అంతట నేదోయొకకా । ర్యాంతరమునఁజోటువిడిచియాదరిపురికా।
సంతతితోఁబోవలసిత । నంతబయలు వెడలెఁబాటునవ్వలఁజనుచున్॥

౫. గీ॥ బిడ్డలంగనియోముద్దుబిడ్డలార! । మనముజనెడిది పెద్దపట్టణముసుండి।
తప్పిపోదుమువిడిచినదారిలోన । గనుక నా వెంటనడువుఁడీయనినవారు॥

౬. గీ॥ అట్లుచెప్పినబుద్ధులనామతించి । తల్లి రెండు వైపులనుండి మెల్ల మెల్ల।
నాపురీరాజవీధినెయ్యనఁజనంగ । వింతలనుజూపుచును బాటు వెడలిపోయె॥

౭. గీ॥ చిన్నతనమాటచేతఁజూచినవిరొల్లఁ । డెమ్మటంచునుబీడించితిన్నకతన।
నధికరోగంబులకువశమైకృశించి । తుదనశించెనునారోగ్యమదితలంచి॥

౮. గీ॥ సోదరివియోగమునఁదృప్తిసోమరితన । మెనసిరొయెప్పాటసంతోషమెసఁగకునికి।
బెంగగొనిరూపుమాసెనాబిడ్డలిట్లు। పొలియుటంజూచిపాటువ్యాకులమునొంది॥

౯. క॥ క్రిందునుమీఁదునుదెలియక । డెందముకొందలమునొందడిందుపడినదా।
నందమెడలియడలిమృతిం । బొందెంబాటాత్మసుతలపోకంజనుచున్॥

## ౧౦. తొందర.

౧. గీ॥ కటకపట్టణముననొక్కకాఁపువాఁడు । పంటపండించుకొనిదానిఫలమువలన।
వాలుబిడ్డలుదానుసౌఖ్యమునఁగాల । యాపనముసేయుచుండెన్యాయంపుదారి॥

౨. క॥ అతఁడుతనయింటికాఁపున । కతివిశ్వాసంబుగలిగియలరుశునకము।
న్నతిఁబెంచుచుండెనదియుం । బతియానతిదాఁటకుండవర్తిలుచుండెన్॥

3. గీ॥ ఇట్లుకొన్నినాళ్లులేగినపిమ్మటఁ । బంటలేమిఁబెట్టుబడికిఁదిండి।
కొకటజరుగకునికినొకధనవంతున । ప్పిమ్మటంచుఁగోరనింతధనియు॥

౪. గీ॥ కుదువదెమ్మటంచుఁగోరిననాకాఁపు । కుక్కనిత్తునంచుఁగోర్కెఁజెప్ప।
ధనికుఁడొప్పుకొనియెశునకముంగాఁపిచ్చి । యప్పుఁబుచ్చుకొనియెనట్టులుండ॥

౫. క॥ ధనికునియింటికినొకరే । యినిదొంగలుదూరివానియింటఁగలధనం।
బునుసర్వముదొంగిలితోఁ । గొనియొకచోఁబాతిపెట్టఁగుక్కయుఁగనుచున్॥

౬. క॥ ఉదయమునలేచిధనికుం । డిదియేమనియేడ్చుచుండనిటునటుతోకం।
గదిలించుచువేపిధనికు । నెదుటనడువఁదొడఁగెఁగాంచియేగెనువెంటన్॥

౭. గీ॥ అట్లుతనవెంటవారురానవలికేగి । పాతిపెట్టినచోటికిఁబాతికాళ్ల।
దువ్వనాసైగఁగనివారుద్రవ్విచూడ । నెల్లనుండినఁగొనిపోయియుల్లమలర॥

౮. చ॥ ధనికుఁడుసంతసించిమనద్రవ్యమునీశునకంబుగాదెదె।
చ్చెనుమఱలంగనంచునుతిజేసిపదంపడిబుజ్జగించినీ।
ఋణమిదెతీరెద్రవ్యమిఁకనీవలదీశునకంబుబంపినా।
ననియొకచీటివ్రాసిమెడనంటఁగఁగట్టుచుఁబంచెనంతటన్॥

౯. గీ॥ వేపివచ్చుచునుండంగఁగాఁపువాఁడు । దారిలోఁదారసించియద్దానిఁగాంచి।
సాహుకారునిదెట్లొమోసంబుజేసి । వచ్చెననితామనంబునఁబడెఁగఁగొట్టె॥

౧౦. గీ॥ ఆయమందుఁగుక్కకాదెబ్బతగులుట । వేగఁజచ్చెదానిఁబెంచినట్టి।
ప్రేమచేతఁజేరివీక్షింపమెడనొక్క । చీటికానఁబడఁగఁజింపిచదివి॥

౧౧. గీ॥ ఋణముదీర్చినట్టిశునకంబునిట్లుతోం । దరనుబట్టిచంపినాఁడముప్పు।
వచ్చెనంచునేడ్చెవసుధనెవ్వరికైనఁ । గానివేగిరింపవానియాను॥

## ౧౧. మోసము, (గీతములు.)

౧. మత్స్యములునిండియుండినమడుగునొకటిఁ । గాంచివానినిబట్టిభక్షించుటెట్లు।
టంచులోఁదలంచితాఁబొంచియొక్క । వంచనోపాయముఘటించిబకమువచ్చి॥

౨. ఒడ్డునంజేరిమునివృత్తినుండెఁగొన్ని । నాళ్లుప్రతిదినమందుమీనములుదాని।
దరికివచ్చుచుఁబోవుచువెఱపుదక్కి । చనువుచిక్కనదానితోఁజాలఁగలసి॥

౩. మెలఁగుప్రస్తావవశమునమీరలిట్లు । తపముసేయుటయేమనితన్నునడుగ।
నెంతబ్రతికినఁజావునకేగదయిది । యెఱుఁగకెవ్వరుపరగతినెన్నఁబోరు॥

౪. ఏనటులఁగాకపరచింతనిట్టినిష్ఠఁ । బూనినాఁడనుసమ్మతితోనటంచుఁ।
జెప్పియతినైష్ఠికునిపోల్కిఁజెదరకకను । మోడ్చిమాయనభినయించెమీనులెల్ల॥

౫. నిజమనిభ్రమించిపరిచర్యనెఱపఁగొంత । కాలమరిగినవెనుకబకంబొకప్పు।
డన్నిచేఁపలుతనచుట్టునున్నవేళఁ । గంటికిన్నింటికొకధారగాఁగనేడ్చె॥

౬. బకమునిశ్రేష్ఠయెన్నఁడువనటలేని । నీవుకుందుటవింతదీనికిఁగతంబు।
దెల్పుమనిసాగిలంపడితెరలకున్న । మీలఁగనుఁగొనిబకమేమిమీకుఁజెప్ప!॥

౭. కల్మిసుఖదుఃఖములఁదెచ్చుఛీయటంచు । సర్వసంగంబువర్జించిసరసిదరివ।
సింపవిధివశమేమొ! మీస్నేహమబ్బెఁ । జెప్పనోరాడదిచ్చటఁజేరియుంట॥

౮. మీకునాపదవచ్చినదాకఁగాఁద । లంతునిన్నటిదినముజాలరులువచ్చి।
వేఁటలాడుటకెందియీపూఁటగాదు । రేపువచ్చెదమనిపోయిరేపుమీఁద॥

౯. ఆపలుకునాచెవింబడ్డయంతనుండి । పరితపించుచునుంటిలోఁబట్టలేక।
వెల్లడించితిమనకికఁజెల్లెఁజెల్లి । యనుచుదీనతఁజూపసత్యమనినమ్మి॥

౧౦. మీలుగుండెదిగుల్పడిమీరెమమ్ము । దరికిఁజేర్పఁడటంచునెంతయునువేఁడ।
నిక్కడినెయొక్కకాసారమెసఁగునందు । వసఁజేర్చెదమిముభయపడవలదని॥

౧౧. చెప్పిముక్కుపుటములతోఁజక్కఁబట్టి । యొక్కొకటివేగఁగొంపోయియొక్కకొండ।
బండపైనుండిభక్షించెబకముతుదకు । నెండ్రియొకటిమిగిలివేడనిట్లుకొంగ॥

౧౨. మిన్నుముట్టివెసంబొఱుచున్నఁగాంచి । క్రిందుజలమెందునులేమినిగుందిమీల।
మోసముంజేసెననియూహఁజేసియెడఁద । బయలుపడనీకబకమ! నన్బట్టిమోచి॥

౧౩. బడలినాఁడవునీగొంతుబట్టివత్తుఁ । గొంతవిశ్రాంతిదాననీకుఁగలుగునని।
యట్లుజరిపించిపోవుచోనాబకంబు । మున్నువలెమీలనెల్లనుదిన్నచోట॥

౧౪. సారదివాలంగఁబోవ నెండ్రిచూచి కొంగ । కుత్తుకం గత్తిరించెఁ గక్కునను జారి।
బిలములో దూరి బారిదప్పించుకొని యోఁ । గంటిరే కద ! యివె మోసగాని పాట్లు॥

## ౧౨. కృతజ్ఞత.

౧. క॥ అమరావతియను పురమున । నమరప్రభుతుల్యుఁ డౌనృపాగ్రణి యొకఁడు।
త్తముఁడు గలం డాతఁడు న్యా । యమునం బాలించుచుండె నాత్మప్రజలన్॥

౨. క॥ ఆనరనాయకుఁ డఖిలజ । నానంద మొనర్పఁ జాలునట్టి సరసమా।
గానంబునఁ దనకభిరుచి । గానం గాయకు నొకా నొక నిదరిఁ జేర్చెన్॥

౩. క॥ ప్రతిదిన వినోదము గనీ । గతి సంగీతంబు వినుచు గాయకు నకుస।
త్కృతి సేయుచుఁ జిరకాలం । బతి మోదముతోడఁ గడపెనట్లున్న తఱిన్॥

౪. క॥ వైరులతోడ నొకప్పుడు । పోరుత టస్థించి దూరభూమికరిగియా।
రారాజు తనబలంబున । వారల ననిఁ నోర్చి గెల్చి వచ్చెడిపట్లన్॥

౫. గీ॥ వైరివీరులు పల్వురు జేరి వాని । దారి నరికట్టి పోనీక క్రూరవృత్తి।
జూపఁ దనసేనతో వారి నాపలేక । చిక్కువడియుండె నటఁ గొంత సేనతోడ॥

౬. ఆసమాచారమల్ల గాయకుఁడు వినివి । చారమగ్నాంతరంగుఁడై చక్కఁ దేరి।
తానటకుఁ బోయి యెటులైనఁ దత్ప్రభుఁ గొని । తేవలయు లేనిచోఁ గడతేరవలయు॥

౭. గీ॥ అంచు మనుగృతప్రతిజ్ఞుఁడై యపుడ వెడలి । నృపులసన్నిధి కేగి వీణియను బాడి
తనదు నేర్పున వారి నెమ్మనములనుగ । రంచి బహుమితిగాఁ దనరాజు నడిగి॥

౮. గీ॥ వారు సరసులుగా వున వైరి నైన । గాయకుని కోర్కెఁ దీర్పఁగ నీయవలయు।
నంచు నెంచి చెఱ న్విడిపించిరతని । గాయకుని గూడి రేఁడు చక్కటికి వచ్చి॥

౯. గీ॥ తన్నుఁ జెఱనుండి విడిపించె నన్న మేలు । దలఁచి తన యర్ధ రాజ్యమాతనికి నిచ్చెఁ।
గంటిరే! యొండొరుల కృతజ్ఞతలు గాన । మేలుమఱువని వానికి మేలెకలుగు॥

## ౧౩. కృతజ్ఞత.

౧. క॥ దవవహ్ని నాల్గుదెసల । న్గవిసి వనము నేర్చుచుండ నడుమ నొక పాదం।
దవిలి యెటు బోవఁ దోఁపక । యువిచారించుచుండె నొక పాము తఱిన్॥

౨. క॥ ఆదారి నెయొక బ్రాహ్మణుఁ । డేదో పని మీఁద వేగ నేగుటఁ గని తా।
నాదీనదశ దెలిపి త । న్నాదట దరి జేర్పుమనుచుఁ బ్రార్థించె నొగిన్॥

౩. క॥ భూతదయాళువు గావున । నాతఁడు పాముని భయంబు నంగ్రియు మదిలో।
నాతత దీనాలాపము । లాతఱి నిగరంపఁ బోవ నాయత్తమునన్॥

౪. గీ॥ పంచెసంచి జేసికొంచక తనచేతి । కఱ్ఱచిట్టచివరఁగట్టి పెట్టి।
యోరసిల్లియల్లయురగముదరిఁజేర్పఁ । బాముదానిలోనఁబడియెనపుడు॥

౫. గీ॥ పాముఁడాసంచి నేలపైఁబోరగించి । దారిఁబోవుటకల్లనఁదారుచుండ।
విశ్రమించియతనిబాము వెంబడించి । కరువగమకింపనతఁడుబిగ్గరగనరచి॥

౬. గీ॥ దాపుపొలమునఁబని సేయుకాఁపువాండ్ర । గుంపులోఁజొచ్చిజరిగినగుట్టుఁజెప్ప।
వారలదివినిపామునుబాదివాని । జడుపుదీరిచియంపిరిసత్వరమున॥

౭. క॥ ఎప్పుడుకృతజ్ఞునకుఁగడు । ముప్పెతటస్థించుఁగానమున్గానియెపుడుం।
దప్పకకృతజ్ఞతయెమదిఁ । జొప్పించుటయొప్పనంచుఁజూడుఁడిమీరల్॥

## ౧౪. అన్యాయము.

౧. క॥ మున్నొకబుద్ధికుబుద్ధియ । నన్నెగడినయిద్దఱొక్కనగరోత్తమునం।
దున్నారువిప్రకులజులు । చిన్నతనమునుండిమిగులచేరికతోడన్॥

౨. క॥ ఒకరినొకరొకగడియవిడు । వకయుండిరివారు చేయుపను లెవ్వరు చె।
ప్పక యేచెప్పం బేరులె । సకలంబిటుగొన్ని నాళ్లుజరిగినపిదపన్॥

౩. క॥ ధనహీనుఁడుజీవన్మృతుఁ । డనుమాటంబట్టియెట్లులైననువిత్తా।
ర్జనమొనరింపఁదలఁచిచ । య్యనఁబరదేశమునకప్పుడరిగిరివేడ్కన్॥

౪. క॥ అచటచటిసత్రములఁగుడు । చుచుదానములెల్లఁబట్టుచునుయాచనసే।
యుచునీరుకాసులకుఁబో । వుచునార్జించిరిధనంబుపూనికఁజాలన్॥

౫. క॥ అంతటనింటికివచ్చెడు । చింతవొడమిరొక్క మెల్లఁజేకొనియొకసా।
యంతనమునకొకనగరము । పొంతంగలధర్మసత్రముం జేరిరొగిన్॥

౬. గీ॥ ఎప్పుడెప్పుడుతమయిండ్లకేగెదమని । వడివడినడచివచ్చుటబడలియుటను।
బుద్ధినిద్రించెమఱచికుబుద్ధినిద్ర । రాక మేల్కనిలోఁదమరాకఁదలఁచి॥

౭. ఉ॥ ఇన్నిశ్రమంబులైనఁబడియేకదయీధనముంగడించినా।
మెన్నిదినాలకైననిటువింతధనంబదివచ్చునా? ధనం।
బన్నను గొంచెమాతనిమహార్థము చేపడలోపమున్నదే!।
యెన్నివిధంబులంగనిననియ్యదిమంచిదిగాదెయంచొగిన్॥

౮. క॥ తనపేరుసార్థకంబుగఁ । దనుహానియులోకనిందదలఁపకయేచ।
య్యన రెండుమూటలొకటిగ । నొనరిచిపట్టుకొనిపోయెనొంటిగదారిన్॥

౯. గీ॥ అప్పుడప్పురికోమటియొక్కసెట్టి । యింటికింగన్నముంద్రవ్వ నేగుచున్న।
దొంగలాతనిమూటఁగనుంగొనియయ్య। డంచిసర్వస్వముంవొంగిలించిరతఁడు॥

౧౦. గీ॥ చేయునదిలేక వ్యర్థుఁడై చెడ్డబుద్ధి । చేటుఁ దెచ్చెననుచు నేడ్చి చేరె నింటి।
కచ్చుటసుబుద్ధి లేచిక న్విచ్చిచూచి । సఖుఁడు రొక్కము లేమి చేఁ జాలఁ గుంది॥

౧౧. క॥ తనయాపద నాపురిగల । జనములతోఁ జెప్పి వారిసాహాయ్యము చే।
తను మఱలమిక్కిలిధనా । ర్జనముగని పురంబు సొచ్చి సౌఖ్యము నొందెన్॥

౧౨. క॥ కావున నన్యాయము జనుఁ । డేవిధమునఁ జేయఁగూడ దెఱుఁగకె తెఁగియుం।
గావించె నేని గలుఁగక । పోవు నెతత్ఫలము దీనిబుద్ధిఁ దలఁపుఁడీ॥

## ౧౫. ఉపాయము. (గీతములు.)

౧. కానలో నేటిదరి మఱ్ఱిమ్రాని మీఁద । గూఁడు గావించుకొని యొక్క ఘూకమిధున।
మట్టియేఁటేట గ్రుడ్డులఁ బెట్టుచుండెఁ । గాని యివి యెరకై పోవఁ గాంచి పొంచి॥

౨. క్రిందిపుట్టలో నికృష్ణసర్పము వాని । మ్రింగుచుండె ఘూకమిధున మట్టి।
కూహకంబు దెలియకుండి కొన్నాళ్లకుఁ । దెలిసి యెట్టులిచట నిలువఁగలము?॥

౩. ఉన్నచోటు విడువ నొప్పదు మది, యుప । ద్రవము దప్పదున్న దైవ మేమి।
సేయు నోయటంచుఁ జింతించుచున్నచో । నాడుపిట్ట మగని నపుడు గాంచి॥

౪. వగవ నేమి ఫలము ? పాముఁ జంపునుపాయ । మెట్లొ సేయుమన్న నెఱిఁగి యెగిర।
దరిని స్నానమాడు తరుణుల హారమొ । క్కటిని ముక్కుతోడఁ గఱచి తెచ్చి॥

౫. వారుచూచి వెంటఁబఱ తెంచి బెదరింపఁ । బాము పుట్టలోనఁ బార వైచి।
చెట్టుమీఁది కెక్కఁ జేడెలుందమమగ । వారితోడఁ జెప్ప వారువచ్చి॥

౬. పుట్టఁద్రవ్వి యందుబుసకొట్టు పామును । జంపి హారముఁ గొనిచనిరి గూబ।
లంతసంతసించి యందు గ్రుడ్లనుబిల్ల । లుగనొవర్చి సౌఖ్యముగ వసించె॥

౭. తలఁప నెందు దేహబలముకంటెను బుద్ధి । బలమె యెక్కుడనుట తేలి పైదీనఁ।
గాదె! యెంత గొప్పకార్యమైన నుపాయ । మునజయింపవచ్చు మనకు నిజము॥

## ౧౬. అసూయ.

౧. క॥ ఒకనికలిమిఁ గనుఁగొని యో । ర్వకయుండుటసూయ దానవచ్చు నెయొకయిం।
చుకయైని మేలు నైస । ర్గికమే తేటపడుఁ గానికీడదివినుమీ॥

౨. గీ॥ ఒకనికిరువురు భార్యలైయుండిరందు । మొదటిదిగయాళి రెండవయది యొసాధ్వి।
యిటులఁదమవర్తనము లెల్ల రెఱుఁగఁగొన్ని । నాళ్లుచన దైవయోగంబునం గ్రమమున॥

౩. గీ॥ చూలుదాలి చినవమాససిద్ధ జెందఁ । గొడుకుఁగ నెసాధ్వి గయ్యాళి కూఁతుఁగని [illegible]।
నందులకు డెందమందు గయ్యాళియుడికి । యాత్మనోదార్చ నేరక యడలియడలి॥

౪. క॥ ఏరీతినిట్టితాపము । దీరుతునోయనుచుఁదనమదిందలఁచితటిం।
గోరికని పెట్టియుండెను । క్రూరాత్ములచిత్తమెపుడు క్రూరము కాదే!॥

౫. గీ॥ పైకిమంచిచూపివర్తిల్లుచోక నాఁడు । బాలుఁడాడమనసుఁబట్టలేక।
ప్రేమయున్నయట్లబిడ్డ! రారమ్మని । విషముఁగలిపిరొట్టెఁబెట్టెనంత॥

౬. క॥ అదివాఁడుంగైకొని యది । ముదమునఁదల్లికిని జూపఁబోయెనిఁకమనో।
రథము నెరవేరెననియా । ముదితయులోపలికిఁదానుబోయెనుబిదపన్॥

౭. గీ॥ అంతలోనసాధ్వియదియేమియనరొట్టె । యమ్మపెట్టెనాకుననుచునున్న।
పిల్లవచ్చి నాకుఁబెట్టవాయనఁజెటి । సగముజేసిపెట్టెనరగనామె॥

౮. గీ॥ దానికేమితెలియుఁ! దడయకమ్రింగిన । గుటకలోననాల్కకొంచుఁబోవఁ।
ద్రెళ్లి నేలఁబడియెఁ దెల్విసుంతయులేక । సాధ్వియందుకేడ్వసాగెనంత॥

౯. గీ॥ వేగనాయేడుపాలించియాగయాళి । యేమియదియనుచునుజక్క నేగుదెంచి।
క్రిందఁబడియున్నతనబిడ్డనుందరినొడి । డిల్లపడినసాధ్వినిగనితల్లడిల్లి॥

౧౦. క॥ మొదటికిమోసము దెచ్చెం । గద నేటికినాయసూయకట్టాయనిలో।
నాదవినవిచారమునసిది । యదియన నేరకయెయేడ్చియవ్వలఁబోయెన్॥

---

క॥ సకలార్థములు వెదకి బా । లకులుపఠింపఁదగినట్టిలలితగతిని నీ।
తికథామంజరిశృంగా । రకవికులోద్భవుఁడు సర్వరాయఁడొనర్చెన్॥

సంపూర్ణము.

# నీతికథామంజరి తప్పొప్పులపట్టి.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౨ | నెఱుగ | రెచ్చు |
| | ౩ | యువన | యౌవన |
| | ౧౦ | చీకటు | చీఁకటు |
| ౨ | ౨౧ | చెందిపట్టు | చెందెఁబట్టు |
| ౩ | ౪ | గూఁర్పు | గూర్చు |
| | ౧౦ | కట్టుకొను | కట్టుకొని |
| ౪ | ౧౧ | యూవరింపు | మావరింప |
| | ౨౫ | బాతి | బారి |
| | ౧౭ | నదియరిగి | నికదరిగి |
| | ౧౩ | కరుదెంచుచు | కరుదెంచెను |
| | ౨౮ | పెరఁటి | పెరటి |
| ౬ | ౯ | బండ్లీడ్వు | బండ్లీడ్వ |
| | ౧౨ | లేపికిఁ | వేపికిఁ |
| | ౧౫ | బోనుప | బోయుప |
| | ౧౯ | దను | దన |
| ౭ | ౬ | దాఁట | దాట |
| | ౭ | ఓక | ఒక |
| | ౧౯ | త్స్పవము | త్స వము |
| | ౨౩ | గడపె | గడిపె |
| ౮ | ౫ | నదా | సదా |
| | ౬ | జనుచుఁ | గనుచుఁ |
| ౮ | ౧౦ | శునకము | శునమును |
| | ౧౨ | నాళ్లు | నాళు |
| | ౧౩ | నింత | నింక |
| | ౧౯ | గదిలించు | గదలించు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౨౩ | మఱల | మరల |
| | ౨౯ | జింపి | జించి |
| ౯ | ౧౧ | మీనులెల్ల | మొనసిమీలు |
| | ౨౬ | క్రిందు | క్రింద |
| | | మెందును | మెందు |
| ౧౦ | ౨ | బోవ | బో |
| | ౧౭ | బహుమితి | బహుమతి |
| | | నడిగి | నడిగె |
| | ౨౨ | కృతజ్ఞత | కృతఘ్నత |
| | ౨౩ | నేర్చు | నేఱ్చు |
| | ౨౪ | చుండె | చునటుండె |
| ౧౧ | ౩ | పారు | పాఱు |
| | ౪ | నరచి | నఱచి |
| | ౭ | కృతజ్ఞు | కృతఘ్ను |
| ౧౨ | ౫ | గూఁడు | గూడు |
| | ౯ | యేఁటేట | యేటేట |
| | ౧౭ | కెకృ | కెక్కృ |